# మంచిస్నేహం

## (పిల్లల నవల)



శివకోటి లక్ష్మీనరసింగారావు





క్వాలిటీ పబ్లిషర్సు
విజయవాడ-2

హ్యాపిటీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
అక్టోబరు '59

4

వెల
1-25

మేనేజింగు ఎడిటరు
మురళీకృష్ణ

ఎడిటర్
రామారావు

5

సాధారణంగా తల్లి దండ్రులకి పుత్ర వాత్సల్య

ముండి తీరుతుంది. కానీ వీళ్ళ తల్లి దండ్రులకు అందరి తల్లి దండ్రులకూ ఉన్నంత వాత్సల్యము లేదు. ఏదో తల్లి మాత్రము వీళ్ళిద్దరూ అంటే కాస్తంత ఆదర ముండేది.

'బాబూ' అని పిలుస్తుంటారు పెద్దవాడిని. చిన్న వాణ్ణి "బుచ్చి" అని పిలుస్తుంట్యారు. అవే పేర్లు బడిలో కూడ పిల్లలందరికీ అలవాటైపోయినై. బాబుకీ బుచ్చికి చదువులో ఒక్క క్లాసే తేడా కొంతకాలం తరువాత ఎనిమిదో తరగతిలో ఇద్దరన్న దమ్ములూ ఒకే క్లాసు వారయ్యారు. అలా కలుసుకోవడంలో ఏమంత ఆశ్చ ర్యంలేదు. పెద్దవాడు అల్లరి పనుల్లో మొదటిమెట్టువాడు. ప్రతిదానికీ చిలిపి కయ్యాలే. ఎవరితోనైనా దెబ్బలాడ కుండా ఒక్క ఘడియయైనా అతని చేతులు ఊరుకో లేవు. చిన్నవాడు అంత అల్లరిచేసేవాడుకాదు. చేసినా కాస్త ముందూ వెనుక చూసి మరీచేసేవాడు.

ఆ నాడు దసరా పండుగ. పిల్లలందరూ తెల్లవారు ఝూమున లేచి తలంటుకొని, కొత్తబట్టలు కట్టుకొని, తలో బాణం పట్టుకొని ఉదయం ఏడు గంటలయ్యేసరికల్లా

బడికి చేరుకున్నారు. అది కాస్త పల్లెటూరు కాబట్టి వయస్సులోనూ, క్లాసుల హెచ్చు తగ్గుల్లోనూ భేదం లేదు. బడి పిల్లలంతా వచ్చారారోజు. ప్రతి పిల్లవాడి ముఖంలో ఏదో తెలియని సంతోషము తాండవిస్తోంది. మాష్టర్లు తెల్లటి పంచలు కట్టుకొని, తలపాగాలు చుట్టుకొని వచ్చారు. వీళ్ళ ముఖాల్లో విద్యార్థుల ముఖాల్లోవున్న సంతోషంకంటె రెండింతలు సంతోషం తాండవిస్తోందని వేరే చెప్పనక్కర్లేదు. విద్యార్థులందరినీ కొన్ని భాగాలుగా విడమరిచి, ఒక్కో భాగానికి చెందిన విద్యార్థుల్ని ఒక్కో మాష్టారు నడిపిస్తున్నారు.

బాబూ, బుచ్చీ చదువులో పెద్దకాబట్టి అందరికంటె మొదటి భాగంలోనే బయలుదేరారు. వీళ్ళ భాగంలో బాబు కాస్త చురుకైనవాడని అతన్నే మొదటి స్థానే నిలబెట్టారు. బాబు ప్రక్కనున్న ఆడపిల్లల లైనులో మొదటనే నిలబడింది ఇందిర. చక్కని తెల్లటి గౌను తొడుక్కొని, చాలీ చాలని జోళ్ళు వేసుకుంది. బాబు హుషారుగా నడవసాగాడు. బుచ్చి కూడ వాళ్ళమధ్య ఇరుక్కొని నడుస్తున్నాడు.

అప్పుడు వాళ్ళందర్నీ ముందుగా కాళికాదేవి ఆలయంలోకి తీసుకెళ్ళి దర్శనంచేయించి, పూలవర్షం కురిపించారు బాణాలతో. ఒక్కొక్క విద్యార్థి అభిమన్యుడిలా బాణాలు పట్టుకొని, పూలవర్షం కురిపించారు.

ఆ పూలవర్షం కురిపిస్తున్నంతసేపూ వాళ్ళ ముఖాలూ, చేష్టలు చూడాలి! ఒకటే సరదా, ఒకటే నవ్వులు, ఒకటే ఆనందంతో దేవిని ధ్యానించారు. బాబు కూడ పువ్వుల్ని బాణంలోపెట్టి కొట్టి తరువాత జేబులోని ఒక రాయిని తీసి బాణంలోపెట్టి ఇందిర కాలుమీద కొట్టి ఏమీ తెలియ నట్టుగా అందరిలాగే రెండు కళ్ళూ మూసుకొని దణ్ణం పెట్టుకోసాగాడు.

ఆ దెబ్బ ఇందిరకి గట్టిగా తగిలిందేమో "అమ్మా" అని చిన్నకేక వేసింది ఎవరూ వినకుండే లాగున. అప్పుడు ఇందిర బెక్కుతూ బెక్కుతూ నడక సాగించింది. ఈ నడకని బాబు చూసి లోలోన నవ్వు కుంటున్నాడు. ఇదంతా కనిపెడుతున్న బుచ్చికి బాబు మీద తెగనికోపం వచ్చింది. ఇందిరపై జాలి పెల్లుబికింది.

ఆ తరువాత వూరిలో ఇళ్ళన్నింటికీ వెళ్ళి మేష్టర్లు వసూలుచేసుకున్నారు దసరా కానుకలు. ఆఖర్ని ఎవరిళ్లకు వాళ్ళని పొమ్మన్నారు. ఏవో అటుకులూ అవీ ఇచ్చి. ఇంటికి పొమ్మనేసరికి బాబూ మిగిలిన పిల్లలంతా ఒక్క పరుగుతీశారు. ఉపాధ్యాయ మహాశయులంతా బళ్ళో రూపాయిలు పంచుకుంటున్నారు. తలుపులు జాగ్రత్తగా వేసి. ఇంక అక్కడ మిగిలింది బుచ్చి ఇందిరా తప్ప మరెవ్వరూలేరు.

దెబ్బ తగిలిన తరువాత కూడ ఇందిర చాలా సేపు నడచిందేమో రాయితో కొట్టిన దెబ్బ బాగా వాచి నడవలేని పరిస్థితికివచ్చి అక్కడే కూర్చొంది. బుచ్చి కళ్ళల్లో జాలి కలిగింది. ఇందిర అవస్థ చూసి అప్పుడు బుచ్చి దగ్గరగావెళ్ళి "ఏం? ఇందూ నొప్పెడుతుందా?" అని అడిగాడు.

"ఔను. బుచ్చీ కాస్త గట్టిగా తగిలిందేమో వాచి నొప్పెడుతుంది."

"అయితే నడవడం కష్టమేనన్నమాట" అని ఆశ్చర్యంగా అడిగేడు.

"కొంచెం కష్టమే బుచ్చీ."

"అరెరె.,...ఎంత పనైంది. చెప్తూతా వుండు. వాడిపని రేపు" అని ఇందిరకి తోడుగా వున్నాడు. ఇందిర బుచ్చి భుజంమీద ఒక చెయ్యివేసి దెబ్బ తగిలిన కాలుని భూమిమీద మోపకుండ దెబ్బ తగలని కాలుతోనే కుంటుగా నడుస్తుంది.

బుచ్చి ఇందిరకన్న వయస్సులో చాల చిన్న వాడే. అయినప్పటికీ ఇందిర భారాన్ని మోస్తూ కొంత దూరం వచ్చేసరికి అలసిపోయాడు.

"ఇందూ కాస్త ఈ అరుగుమీద కొంతవరకు కూర్చొందాముర" అని అరుగుమీదకు తీసుకొని వెళ్ళాడు ఇందుని. ఇందిర అరుగుమీద కూర్చొంటూ

"బుచ్చి నీవు లేకుంటే ఇప్పుడు నా సంగతేమైపోను?..
అంటూ ఇంకా ఏదో మనస్సులో బాధకు ఏడుస్తూంటగా-

"మరేం ఫర్వాలేదు. ఏడవకు ఇందూ, ఇంటికి వెళ్ళి సుందరమ్మ మామ్మచేత మంత్రం ఒక్కటి వేయిస్తే తగ్గిపోతుంది." అని ఇందుని బుజ్జగిస్తూ ఏవేవో మాటలతో ఇందు మనస్సును బాధనుండి తప్పించాడు.

అరుగుమీద కొంతసేపు విశ్రాంతి తీసుకున్న తరువాత ఇందిర బుచ్చి సహాయంతో తన ఇంటికి చేరుకుంది. వారలా యింటికి వస్తుండడం ఇందిర తల్లి చూచి గాభరాపడి లోపలికి తీసుకొనివెళ్ళింది. బుచ్చి అప్పుడు ఛటుక్కున ఇందిర ఇంట్లోకి వెళ్ళి మంచంవేసి అక్కడే పడుకోబెట్టమని ఇందిర తల్లితో చెప్పి బైటకు పరుగెత్తుకుంటూ వెళ్ళాడు సుందరమ్మ మామ్మ ఇంటికి.

"అంతదూరం నడచి రాలేను బాబూ" సుందరమ్మ అన్నా ఆమెకు తోడుగావుండి, ఇందిరదగ్గరకు తీసికొని వచ్చి! మంత్రం వేయించి, మళ్లా మామ్మని తన ఇంటికి దిగబెట్టేస్తాడు బుచ్చి. ఆ వూళ్ళో ఇటువంటి దెబ్బలకి వాటికీ మందు సుందరమ్మే. ఒకటి రెండు మంత్రాలతో పూర్తిగా మానిపోతాయి. బుచ్చి ఇందిరదగ్గరకు వచ్చి "ఏం ఇందు నొప్పి తగ్గిందా?" అని అప్యాయంగా అడిగాడు.

"ఇంకా తగ్గలేదు బుచ్చీ" అవోలా అంది. అప్పటికే చాలాసేపు కావడంవల్ల "ఇక వెళ్తాను ఇందూ. మళ్ళీ సాయంత్రం కలుస్తాలే" అంటూ బుచ్చి ఇంటికి బయల్దేరి వెళ్లేడు.

బుచ్చి ఇంటికి వెళ్లేసరికి మధ్యాహ్నం దాటింది. అమ్మా, నాన్నా ఏమంటారో అని జంకుతూనే వెళ్ళాడు. కాని దేవుడిదయవల్ల అమ్మా నాన్నా ఏమీ అనలేదు. ఇంటికి వెళ్లీ వెళ్లగానే భోజనానికి రమ్మన్నారు. ఆరోజు పండుగరోజు కాబట్టి రకరకాల వంటలు అమ్మ చేసి పెట్టింది. అందరితోపాటు భోజనందగ్గర కూర్చున్నాడే కాని బుచ్చికి అవేవీ సయించలేదు. అన్నం తింటూన్నప్పుడు అప్పుడప్పుడు బాబుపై కళ్ళెర్రజేసి చూసేవాడు కోపంగా. అంతకంటే మరేం చేయలేకపోయాడు.

భోజనాలైన తరువాత బాబు ఎక్కడికో ఆటకు వెళ్ళిపోయాడు. వాళ్ళనాన్న వెళ్ళొద్దని చెప్పినా బుచ్చికి కూడ బాబుకి చెప్పినట్టే ఎక్కడికీ కదలొద్దని చెప్పారు. బుచ్చి తల్లి దండ్రులు మధ్యాహ్నం మామూలుగా నిద్ర పోతున్నారు. బుచ్చికి ఏం తోచక ఏదో దీర్ఘాలోచన చేస్తూ మంచంమీద దొర్లుతున్నాడు. ఏమిటా దీర్ఘాలోచన? ఎవరికోసం? ఎవరిమీద? ఎందుకు?

ఈ ఆలోచనంతా ఇందిరమీదే. ఎంతగానో వాచి పోయిందే కాలు మర్నాటికి తగ్గిపోతుందా? అంత చెడ్డ

పనిని చేసిన అన్నని ఏం చేయాలి? నాన్నతో చెప్పి తన్నిస్తేనో?...ఆ...తన్నిస్తే వూరుకోడే. మళ్ళీ తిరిగి ఎప్పుడైనా తనని తన్నిస్తాడేమో? ఇవే ఆలోచనలు మనస్సులో. ఇందిర వేగం తేరుకోవాలని భగవంతుని ప్రార్థిస్తుండగా ఎప్పుడు పట్టేసిందో నిద్ర తనకి తెలియదు. అలాగే నిద్రపోయాడు.

సాయింత్రం అమ్మ లేపి కాఫీ ఇచ్చేవరకూ తెలివిరాలేదు బుచ్చికి. సాయంత్రం కాఫీ త్రాగగానే బుచ్చి ఇందిరని జూడ్డానికి వెళ్లేడు. ఏం ఇందూ నొప్పి తగ్గిందా? అని ఒక పెద్దమనిషి అడిగినట్లు అడిగాడు. "తగ్గింది. బుచ్చి. రేపటికల్లా పూర్తిగా తగ్గిపోతుంది." అని చెప్పేసరికి బుచ్చి నిబ్బరపడ్డాడు. ఇద్దరూ నవ్వుకున్నారు.

తరువాత బుచ్చి అక్కన్నుంచి రామూ స్నేహితుని ఇంటికి వెళ్లాడు. రామూ బుచ్చీ మొదటి తరగతి నుండీ స్నేహితులే. అప్పుడప్పుడు అంటే చిన్న క్లాసుల్లో చిన్న చిన్న విషయాలకి దెబ్బలాడుకోవడం జరిగినా వెంటనే కలిసిపోయేవారు. ఐదో క్లాసు దాటినప్పట్నుండీ అలాటి దెబ్బలాటలు కట్టిపెట్టి పెద్దమనుష్యులవలే తయారయ్యారంటే ఆశ్చర్యపడవలసిందే! ఇద్దరు స్నేహితులూ కలసి అక్కడకి దగ్గర్లోవున్న ఇసుక తిన్నెల మీదకు వెళ్ళారు. చీకటి పడేవరకు ఆ ఆటా ఈ ఆటా

అడుకొని ఎవరిళ్ళకు వాళ్ళు చేరుకున్నారు. బుచ్చి భోజనం చేశాడు. అమ్మా నాన్నా చదువుకోమనె వరహా బాబు చదువుకోనేలేదు. ఆఖరికి వాళ్ళ బాధ పడలేక బుచ్చి చదువుకుంటున్న దగ్గరకువచ్చి "ఒరే బుచ్చీ...నా పుస్తకంలో కాగితాలన్నీ చిరిగిపోయాయి. ఒకసారి నీ తెలుగు పుస్తకం ఇలా యియ్యి. చదువుకొని ఇచ్చేస్తాను." అని గట్టిగా అడిగాడు. తనకంటే పెద్దవాడు అడిగాడనే భయంతోనే ఇచ్చాడు కాని కాస్త మరెవ్వరయినా అడిగితే ఇచ్చేవాడు కాదు బుచ్చి.

బుచ్చి ఆ పుస్తకం ఎంత క్రొత్తగావుందంటే వాళ్ళ నాన్న పుస్తకాల కొట్లోనుంచి ఎంత క్రొత్తదిగా తెచ్చారో ఇప్పుడు కూడా అంత క్రొత్తగానే వుందా పుస్తకం చెక్కు చెదరకుండా. అలాంటి పుస్తకాన్ని బాబుకి ఇవ్వాలంటే మనస్సు ఒప్పుతుందా? కష్టంమీదే ఇచ్చాడు.

బాబు ఆ పుస్తకాన్ని చదవడం మాని ఒక్కొక్క పేజీలోని బొమ్మలు లెక్కపెడుతూ బాబు అన్న అక్షరాలు పేరి కెన్నున్నాయో లెక్కపెడుతూ కాలక్షేపం చేస్తున్నాడు.

అప్పుడు బుచ్చి "బాబూ" ప్రొద్దుట ఇందిరని అలా రాయితో కొట్టేవుకదా. ఇందిర కాలు ఎంత వాచిపోయి బాధ పడుతుందో తెలుసా?... అన్నాడు.

"తెలీదే...కాలు వాచిందా?"

"ఆ...వాడి నమ్మలేకపోయిందిహడాను. నేను గాని లేకపోతే ఎంత కష్టపడిపోయేదో."

"ఎందుకు అలాగ కొట్టేవు?" అని బుచ్చి కాస్త కోపంగా అడిగాడు.

"ఏం లేదు. సరదాకి నెమ్మదిగానే కొట్టానే"

"ఉండు చెప్తాను సరదాకి నాన్నతో" అని వ్రేలుని చూపించి భయపిస్తూ బుచ్చి అన్నాడు.

దానికి బాబు చాల భయపడ్డాడు. బుచ్చి నిజంగా ఎక్కడ చెప్తాడో అని తనమనస్సు భేజారెత్తిపోయి "ఒరే బుచ్చీ..ఏదో తెలియక సరదాకి చేశాను. దాన్ని నాన్నతో చెప్పడం మంచిదికాదురా." అని జంకుతూ అన్నాడు.

"ఎందుకు మంచిదికాదు? ఒక్కసారి చెప్పితే సరి....అన్నాడు ఎగతాళిగా.

"వద్దురా...చెప్పొద్దు. ఈ సారికి మాత్రం వూరుకో మరెప్పుడన్నా చేస్తేచెప్పు" అని బ్రతిమాలాడు. బుచ్చికి చాలసిగ్గేసి "సరేలే ఏదీ నా పుస్తకం ఇస్తావా. కాని తప్పు చేశానని ఇంటిదగ్గర మాత్రం ఒప్పుకోవాలి" అన్నాడు. ఇందిర దగ్గర క్షమాపణ చెప్పాలంటే బాబుకి చాల చిన్నతనం అనిపించింది. అయినా నాన్నతో బుచ్చి ఎక్కడ చెప్తాడో అని భయంతో అప్పటికి "అలాగే" అన్నాడు. బాబు పుస్తకాన్ని బుచ్చికి ఇచ్చేశాడు.

అప్పుడు వాళ్ళిద్దరూ డాబామీదికి ప్రక్క పట్టుకొని వెళ్లారు నిద్రపోవడానికి. ప్రతి సంవత్సరం ఎండాకాలంలో వాళ్ళిద్దరూ డాబామీదే పడుకోవడం అలవాటై పోయింది. ఆకాశంమీద చుక్కలు అక్కడక్కడ మెరుస్తున్నాయి. వెన్నెలరాత్రి చంద్రుడు ఎంత వెలుగు నీయగలడో అంత వెల్తుర్ని ఇచ్చేస్తున్నాడు. నీలాకాశం మీద అప్పుడప్పుడు తెలుపూ, నలుపూ, బూడిదరంగూ మొదలైన పలు రంగుల మబ్బుల కలయికతో పరుగెడుతున్నాయి. వాటిమధ్య చంద్రుడు దోబూచులాడుతున్నాడు. అన్న దమ్ములిద్దరూ ఆకాశం చూస్తూ వుండిపోయారు. "బాబూ! అదిగో ఆ మేఘం చూడు. సింహంలాగ నడుస్తూ భీకరంగా వెళ్తుంది" అన్నాడు.

"అదేం సింహం? పందిలాగుంది."

"పందెందుకైనది? చూడూ అచ్చంగా సింహాని కున్న జూలులాగే...అంటూండగానే ఆ మేఘాలు దూర దూరంగా పోయాయి.

"అదిగో అది నిజంగా ఏనుగు లాగేవుంది."కదూ

"అవును. సర్కస్‌లోని ఏనుగుకంటే చాల పెద్దది. చెవులు లేవే!"

అసలు వాళ్లు చిన్నప్పటినుండీ ఆకాశంమీద మేఘాల్ని చూస్తూ ఆవులూ, మేకలూ, ఏనుగులూ,

చెట్లని పోతున్న మేఘాలతో పోలుస్తూ పిచ్చా పాటీగా నిద్ర వచ్చేవరకూ ఆడుతూ పాడుతూ నిద్ర పోయేవాడు.

బుచ్చి, బాబు మామూలుగా ఉదయం లేచి స్నానం, కాఫీ అయిన తరువాత పుస్తకాలు పట్టుకొని స్కూలుకని ఇద్దరూ బయల్దేరారు. దార్లో ఇందిర ఇల్లు చేరగానే "పద. లోపలికి" అన్నాడు బుచ్చి, బాబును చూస్తూ.

బాబు ముఖం చిన్నదిగా చేసుకొని బుచ్చి వెన కాలే నడిచాడు. బుచ్చి ఇంట్లో అడుగు పెట్టగానే "ఇందిరా!" అని పిల్చాడు గట్టిగా. అప్పుడే జడ వేయించుకొంటున్న ఇందిర వాళ్ళమ్మని విదిలించుకొని పుస్తకాలు చేత్తో పట్టుకుని "బడికి పోదాం పద బుచ్చీ" అంది.

అలా ఇందిర పరుగెత్తి పుస్తకాలతో వచ్చేసరికి బుచ్చికి నవ్వు వచ్చింది " అప్పుడే మూసిపోయింది" ఇందిర భుజం పట్టుకున్నాడు. "ఔను" అన్నది ఇందిర. ముగ్గురూ స్కూలు దారి పట్టారు. బుచ్చి క్షమాపణ కోరుకోమన్నట్టు బాబు వైపు చాలసార్లు చూశాడు. ఎలాగా? నయం అయిపోయింది. ఇంక క్షమాపణ ఎందు కన్నట్టు బాబు చూచేడు. బాబు స్నేహితుడు పరిగె కన బడగానే వాడితో కలసి బాబు వెళ్ళిపోయాడు. బుచ్చి, ఇందిర మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. "అరె!

ఏమయిందే గాయం! ఆశ్చర్యంగా అన్నాడు బుచ్చి.
"నొప్పిమాత్రం తగ్గింది బుచ్చీ! వాపు ఇంకా తగ్గలేదు"
ఇదిగో అని పాదం చూపించింది. "అది కూడ తగ్గి
పోతుందిలే" అంటూనే స్కూలు చేరారు.

క్లాసులో బుచ్చిది మొదటి బెంచీ. బాబుది వెనుక
బెంచి విరల్‌తో స్నేహం ఎక్కువైన దగ్గర్నుంచీ. బుచ్చి
తన క్లాసు మేష్టారు చెప్పింది శ్రద్ధగా వింటాడు దాని
కంతా వ్యతిరేకం బాబుది. బుచ్చి రెండు మూడు సార్లు
మొదటి బెంచిమీద కూర్చొమన్నాడు బాబుని. కాని మన
బాబు మొదటి బెంచీమీద కూర్చొంటే తన అల్లరులు
సాగుతాయా? ఒక్కసారి కూడ కూర్చొండేవాడు కాదు.

రోజులు గడుస్తున్నకొద్దీ బుచ్చికి చదువుమీదా
బాబుకి విరల్‌మీద మమకారం ఎక్కువయాయి. విరల్
బాబుకంటె వయస్సులో పెద్దవాడు నెలకు నాలుగైదు
సార్లే బళ్ళోకి వస్తుంటాడు, తక్కిన రోజుల్లో అంటే స్కూలు
కట్టేసిన రోజుల్లో రైలు రోడ్డంట కొంతదూరం షికారు
వెళ్ళి రైలు స్టేషన్లో స్కూలు టైము అయ్యేవరకూ
తచ్చాడి సరీగ్గా స్కూలు విడిచిపెట్టే వేళకు ఇంటికి
చేరుకునేవాడు. బుచ్చి గాని తన క్లాసులో లేకపోతే బాబు
కూడ విరల్‌తోపాటు వెళ్ళేవాడే కాని వీలుపడలేదు.
అందుచేత సాయంత్రం బడి విడిచిపెట్టినప్పుడు
స్కూలుకు వెళ్ళేముందూ కలుసుకొనేవారు. ఆ సమ

యంలో బాబుకి సిగరెట్లు కాల్చడం అదీ నేర్పాడు. బుచ్చికి మాత్రం సిగరెట్లు కాలుస్తున్నట్లు తెలియనీయ లేదు.

ఒకనాడు బుచ్చి, బాబు వాళ్ళ ఇంటికి పట్నం నుంచి, సిగరెట్లు అదే తడవుగా కాల్చే మామయ్య వచ్చేడు. చెప్పాలంటే సాధారణంగా సిగరెట్లు కాల్చే వాళ్లని బుచ్చి అసలు చూడనేలేదు. అంతవరకూ చుట్టలు కాల్చే వాళ్లని తప్ప. మామయ్య కాలుస్తున్న సిగరెట్లు బ్రహ్మ విద్యలా తోచింది బుచ్చికి. వింత మనిషికి మల్లే మామయ్యని ఎగాదిగా చూసేడు.

ఆ రోజు రాత్రి అందరూ క్రింద వాకిట్లోనే పడుకున్నారు. అందరూ నిద్రపోతున్నారు. బుచ్చి, బాబు నిద్రపోలేదు. పైకిమాత్రం ఇద్దరూ నిద్రపోతున్నట్లే నటిస్తూన్నారు. అప్పుడు బుచ్చి నెమ్మదిగా లేచి అందరూ నిద్రపోయారో లేదో చూచాడు. బాబు దగ్గర చిటికలు రెండు వేసేడు. బాబు నిద్రపోతున్నవాడివలే గుర్రు పెట్టేడు! అప్పుడు బుచ్చి నెమ్మదిగా నడుస్తూ మామయ్య జేబు దగ్గరకి వెళ్ళాడు. జేబులో చెయ్యిపెట్టి తడిమాడు. సిగరెట్టుపెట్టీ, అగ్గిపెట్టీ వున్నాయి. వాటిని జాగ్రత్తగా తీసి గదిమూలకి వెళ్లి నోట్లో ఒక సిగరెట్టుపెట్టి అగ్గి పుల్ల వెలిగించి అంటించి ఒక్క పీల్పు పీల్చాడు. గట్టిగా దగ్గు దగ్గాడు. రెండోసారి మళ్లీ పీల్చాడు, అదే

ఘాటు వాసనతో అక్కడే ఉమ్మి చేతులు నోటికి అడ్డంగా పెట్టుకొని దగ్గాడు. అదంతా గుమ్మంవగ్గర నిల్చొని బాబు చూసి ఏమీ తెలియనట్టు తన స్థలంలోకి వెళ్ళి పడుకున్నాడు. బుచ్చి అగ్గిపెట్టీ, సిగరెట్టుపెట్టీ మామయ్యా జేబులో పెట్టేసి కాల్చిన సిగరట్టుని ఇంటి కాలువలో పారేసి నిద్రపోయాడు.

మర్నాటి ఉదయం మామూలుగానే అందరూ లేచి ఎవరు చేసుకోవలసిన పనులు వాళ్లు చేసుకుపోతు న్నారు. వాళ్లమ్మ వంట చేసుకుంటుంది. నాన్న పొలానికి వెళ్లిపోయాడు. మామయ్య చుట్టంకాబట్టి తనకేం పనులు లేకపోయినా!...ఇంకేం పని? రోజూ వున్నపనే అదే సిగ రెట్లు పని! కాల్చేస్తున్నాడు వరుసగా. బుచ్చి తన పలును చేసుకుంటున్నాడే కాని దృష్టి అంతా మామయ్యమీదనే, మనస్సంతా మామయ్య సిగరట్లమీదనూ. ఎలా కాలు స్తున్నాడు? ఒక్క దగ్గూ దగ్గకుండా మరి! వాసనా అదీ లేదా? రాత్రి నేను కాలుస్తుండగా దగ్గు ఎందుకు వచ్చింది? పెద్దవాళ్లు కాలిస్తే దగ్గు రాదేమో!-ఇదే బుచ్చి మనస్సులో ఆలోచనలు. భోజనము చేసిన తరువాత స్కూలు పుస్త కాలు పట్టుకొని బడికి వెళ్తుండే బాబు "బుచ్చీ" ఈ వేళ బడికి నీతో కూడ కలిసి వస్తావుండు"! అన్నాడు. ఇలా బాబు అనడం బుచ్చికి ఆశ్చర్యం కలగకపోలేదు! ఎన్నాళ్ళనుండి తనతోకలసి స్కూలుకి రావడంలేదు

కదా! ఈ రోజు తనతో ఎందుకు కలిసి వస్తానంటు న్నాడూ? అని బుచ్చి ఆలోచనలో పడ్డాడు. ఇంతలో కుడి భుజంమీద బాబు చెయ్యిపడి "పద బుచ్చీ!...స్కూలికి" అన్నాడు. బుచ్చి సందేహిస్తూ బాబు ముఖంలోకి సంగ తేమిటి? అన్నట్టు పరకాయించి చూచాడు.

"తమ్ముడూ...రాత్రి ఏంపని చేసేవు?" అడిగాడు బాబు కళ్ళు మిటకరిస్తూ. బుచ్చిని తమ్ముడూ! అని పిలవడం ఇదే మొదటిసారి. తనకు బాగ జ్ఞానం వచ్చిన తరువాత. "ఏం పని?" అని బుచ్చి అన్నాడే కాని గుండెలు టక్...టక్...మని గోడ గడియారం కొట్టు కొంటున్నట్లు కొట్టుకో సాగింది.

"అదే అడుగుతున్నా. నిజంగా సిగరట్టు కాల్చ లేదూ?" అడిగాడు.

"నీకెలా తెలిసింది?" జంకుతూ జవాబిచ్చాడు బుచ్చి.

"ఎలాగోలాగ తెలిసింది. మొట్టమొదట నువ్వు కాల్చేవా? లేదా?"

"ఔను! కాల్చేను, మామయ్య ప్రొద్దుటినుంచీ కాలుస్తుంటే ఎలాగుంటుందో అని చూశాను."

"అహా?.........ఎలావుంటుందో అని చూశావే!.... జాగ్రత్త! నాన్నతో చెప్తాను, జేబులోనివి తీసి మరి

కాలుస్తున్నావే! అంత అర్ధరాత్రివేళ! అంటూ కళ్లెర్రగా చేసాడు బాబు.

"చెప్పొద్దు బాబూ....చెప్పొద్దు. నాన్నతో మాత్రం చెప్పకు కాల్చేనని" ఏడుపు ముఖం పెట్టి అన్నాడు. "సరేలే. నా మాటకు ఎదురు చెప్పకుండా వుంటుండు. ఎప్పుడైనా ఎదురు చెప్పడంగాని చాడీలు చెప్పడంకాని చేశావా! నాన్నతో నీ సంగతి చెప్పేస్తా" నని బాబు మూతిమీసం వున్న మొగాడికిమల్లే త్రిప్పుతూ విఠల్ కన్పించగానే వాడితో స్కూలుకు వెళ్లిపోయాడు...

బుచ్చి ఒంటరిగానే బడికి వెళ్ళాడు. కాని ఆ రోజు పాఠాలేవీ బుర్రకి సరిగా పట్టలేదు. సరికదా! తనకి బాగా వచ్చినదాన్నే చెప్పడం మరచి మాష్టారుచేత చీవాట్లుకూడా తిన్నాడు. చీవాట్లు తింటున్నప్పుడు విఠల్, బాబూల ముఖాలెంత పొంగాయో చెప్పలేము. ఎందుకో ఆ సంతోషం? బుచ్చి అలా ఒళ్ళో వున్నంతసేపూ ఏదో ఆలోచిస్తూనే వున్నాడు. తమ రాత్రి చేసిన పనిగురించి.

బడి విడిచి పెట్టారు. పిల్లలందరూ ఇళ్ళకు వెల్లిపోయారు ఒకడు బుచ్చి తప్ప బడి పంతులు తలుపులు వేస్తున్నప్పుడు బుచ్చిని చూసి "ఏం? బుచ్చి ఇంకా ఇక్కడ కూర్చొన్నావేం? అంతా వెల్లిపోయారె" అని అన్నాడు. చేత్తో వీపుమీద తట్టుతూ.

మాష్టారి చేతి స్పర్శకు ఏదో లోకంలో వున్న బుచ్చి ఈ లోకంలోకి వచ్చి చుట్టూ చూశాడు. అన్ని బెంచీలు ఖాళీగానే వున్నాయి. ప్రక్కని మేష్టారు నిల్చుని వున్నారు.

"అంతా అప్పుడే వెళ్ళిపోయారండీ మేష్టారు?" అని ఆశ్చర్యముగా అడిగాడు బుచ్చి మాష్టారు వైపు చూస్తూ—

"అవున్రా బుచ్చీ. అందరూ వెళ్ళిపోయారు. నువ్వొక్కడివే ఎందుకు వుండిపోయావ్?"

"ఏం లేదండి" అని పుస్తకాలు సర్దుకొని గుమ్మం వరకూ వెళ్ళి ఏదో అడగాలని మళ్ళీ తిరిగి వచ్చి "మాష్టారు........" అన్నాడు.

"ఏంరా బుచ్చీ ఏం కావాలి?" అని అప్యాయంగా అడిగారు. బుచ్చి అంటే మాష్టారికి ఎంతో ప్రీతి అవడంచేత.

"కావాల్సిందేమీ లేదండీ....ఒక్కటి...."

"ఒక్కటి కాదు. రెండడుగు చెప్తాను. నీలాంటి వాళ్ళకి చెప్పడమే"

"మాష్టారు . . . సిగరట్టు . . . కాలిస్తే . . .ఏ... మ...ం...డీ? అని బుర్రగోక్కుంటూ అడిగాడు.

"అదట్రా నీ ప్రశ్న. ఏదో నాకు తెలియని ప్రశ్న వేస్తావనుకున్నాను. ఇంతేనా? చెడు అలవాట్లలో సిగరెట్లు

కాల్చడం మొదటిది. పైకి తెల్లగా షోగ్గానే వుంటాయి! షోగ్గానే కాల్చుతారు అది ఎంత చెడ్డ అలవాటో తెలుసా! గుండెలని పాడుచేస్తాయి. అప్పుడు గుండె వేగం ప్రారంభమైనప్పుడు ఆ మనుష్యులూ వేగం చచ్చిపోవచ్చు చూడు సిగరెట్లు కాల్చడం మంచి అలవాటు కాదు. అది సరేకాని ఆ సందేహం ఇప్పుడెందుకు కలిగిందిరా? అని మాస్టారు అంటూండగానే బుచ్చి ఏమీలేదంటూ ఒక్క పరుగు తీసి రాము స్నేహితుని ఇంటికి వెళ్ళాడు. రామూ తలనొప్పితో బాధ పడుతుంటే కొంతసేపు అక్కడ కూర్చొని ఇంటికి బయల్దేరాడు.

అసలు బుచ్చికి దేని గురించైనా కొద్దిగా చెప్పితే చాలు. మిగిలినదంతా అర్థంచేసుకోగల సమర్థుడు. బాబు అలాంటిరికం గాడు. ఒకదానినిగురించి విప్పి విప్పి విపులంగా చెప్పినా దాన్నే మళ్ళీ చెప్పించే గింజుకు పోయేరకం. మాష్టారు ఈ చెవిలో చెప్పితే ఆ చెవుల్లో నుంచి బయటకు పంపించేస్తాడు. అసంతా మనకెందు కన్నట్టు.

సిగరెట్లు కాల్చడం మంచిపనికాదని పూర్తిగా ఇప్పుడు బుచ్చి తెలుసుకున్నాడు. అప్పటినుంచి అన్నని అంటే బాబుని "నేను ఆరోజు సిగరెట్టు కాల్చేనని నాన్నతో చెప్పకూ"? అని అప్పుడప్పుడు అనేవాడు. "చెప్పన్లే! నేను చేసినవి ఏమైనా మాత్రం నాన్నతో

చెప్పావో నేనుకూడ నీ సంగతి అప్పుడు చెప్పి తన్ని స్తాను." అని వేలు ఆడించి భయపెట్టేవాడు. అందుచేత స్కూలుకి అప్పుడప్పుడు ఎగ్గొట్టేసినా ఎగ్గొట్టేసినాడని నాన్నతో చెప్పేవాడుకాదు. స్కూలు మానేయడమే కాకుండా చిన్నచిన్న చిలిపి చేష్టల్ని చేసినా బుచ్చి నాన్నతో చెప్పలేదు భయపడి.

ఇలా కొన్నాళ్లు గడచాయి. ఒకనాడు ఆకాశాన్ని ఎడతెరపని మబ్బులు చుట్టాయి. అనుకోకుండానే ఉరుములతో వాన కురియడం మొదలుపెట్టింది. హోరున శబ్దం చేసుకుంటూ మధ్య మధ్య గాలి రుయ్....రుయ్‌మని శబ్దంచేస్తూ వీస్తుంది. అటువంటి సమయంలో బాబూ, బుచ్చి, వాళ్ల నాన్నా అమ్మా అందరూ వున్నారు ఇంట్లోనే. కాని వాళ్ళ నాన్న పొలంలో ఆవుని కట్టేసి మరచిపోయి భోజనానికి వచ్చే సమయంలోనే ఈ కుంభ వృష్టి పట్టుకుంది. వాళ్ళ నాన్నకి కాస్త వయస్సు మళ్ళిందేమో అంత వర్షంలో వెళ్ళి ఆవుని తీసుకొనిరాలేక ఎప్పుడూ ఏ పనీ చెప్పని పిల్లలకి ఆ రోజు పెద్ద కొడుకును బాబుని పిచ్చి "నాయనా బాబూ! పొలంలో రాటకి ఆవును కట్టేసి మరచిపోయి భోజనానికి వచ్చేను. ఇప్పుడు వర్షం పట్టుకుంది. ఇంత వర్షంలో నేను వెళ్ళలేను పొలానికి. కాస్త జాగ్రత్తగా వెళ్ళి విప్పి తీసుకు రారా! అని చెప్పాడు.

అందుకు బాబు జంకుతూ "బాబోయ్, - ఇంత వర్షంలో నేను పొలానికి వెళ్ళడమా? అమ్మో! నేను వెళ్ళలేనే...." అని ఇంకా ఏదో అంటుండగా కిటికీ దగ్గరున్న బుచ్చి విని అన్న పిరికితనానికి సిగ్గుపడి ఈ మాత్రం పనిని అవసరం వచ్చినపుడు చేయలేవా?" అన్నట్టు బాబువైపు చూసి పొలానికి బయల్దేరేను ఒక్క-నిముషంలో పరుగెత్తుకుంటూ వర్షం ఇంకా ఎక్కువౌతూ గాలి జోరుగా వీస్తున్నా బుచ్చి వాటన్నింటినీ లెక్క-చేయక గింజుకుంటూ కన్నెని తెంపుకోడానికి ప్రయత్ని స్తున్న ఆవుని విప్పి ఇంటికి తీసుకు వచ్చేస్తుండేసరికి వాళ్ళ నాన్నకూడ ఎదురయ్యేడు మధ్య దార్లోనే. ఎంత సేపటికి బాబు బయల్దేరకపోతే తనే బయల్దేరేనన్నాడు. అంత వర్షంలో తండ్రి బయల్దేరినా బాబు "బుచ్చి వెళ్లేడు నాన్నా!" అని అననైనా లేదు.

"అరరె....బుచ్చీ నువ్వు ఎవరితోనూ చెప్పకుండా ఇలా వెళ్లేవేమిరా"అని అడిగాడు తండ్రి. ఆవు పొలంలో వుందని మీరు బాబుతో చెప్పుతుంటే వెళ్లి తీసుకు వస్తున్నా నాన్నా! వర్షంలో తడిసి మీరెందుకు వస్తు న్నారూ? పదండి ఇంటికి" అంటూ వాళ్లు ఇల్లు చేరు కున్నారు.

ఆవుని తీసుకొనివచ్చిన బుచ్చిని బాబు కాస్త ఇదిగా చూసినా అమ్మమాత్రం మంచి హుషారెక్కిం

చింది. "భలేరా! బుచ్చీ మంచిపని చేశావ్. నిన్ను చూసైనా ఆ బాబుగాడిని బుద్ధి తెచ్చుకోమను. ఇంత కష్టంలోనూ నాన్ననే పంపాడు చూశావురా బుచ్చీ! వాడి సాహసం,..." "ఇంక వూరుకోవే! ఏదో చిన్నవాడు. నెమ్మదిగా చెప్పాలి" అంటూ గదిలోకి వెళ్లాడు బుచ్చి నాన్న! అమ్మ హుషారు చూసి బుచ్చి మూతిమీసం లేక పోయినా సరే దువ్వుతూ బాబువైపు వెటకారంగా చూశాడు. అలాగే బుచ్చిబాబు చేయలేని సాహసాలను చేసేవాడు.

బుచ్చి చేస్తున్న పనులు బాబుకి రానురాను ఈర్ష్యగా మారింది. సాహసంలో నేమిటి, చదువులో నేమిటి, సహాయములో నేమిటి అన్నింటిలోనూ ఫస్టే. అదే బుచ్చికి గల విశిష్టత".

బాబూ బుచ్చీ ఇద్దరు పరీక్షలలో ప్యాసయ్యేరు. ఇంక అంతకంటె పెద్ద చదువు చదవాలంటే ఆ వూళ్ళో మరిలేదు, అందుకు బుచ్చీ బాబూ పట్నం పోయి చదువు తామని నాన్నతో చెప్పారు. కొడుకులు వాళ్ళంతటి వాళ్ళు చదువుతామంటే ఏతండ్రి మాత్రం చదివించడు? ఎంత బాధలైన భరించి ఏదోవిధంగా చదివించక మానడు. వీళ్ల నాన్నకి డబ్బుకి ఏమంతలోటు లేనప్పుడు చదివించక ఏంజేస్తాడు? వాళ్లిద్దరి మాటలకు సంతోషించి తప్పకుండా చదివించుతానని మాట యిచ్చాడు.

సెలవుల్లో బుచ్చి స్నేహితులతో సరదాగా కాలక్షేపం చేస్తున్నాడు. కాని బుచ్చికి ఎంత తొందరగావెళ్ళి హైస్కూల్‌లో చేరుదమా? అన్న ఆందోళన హెచ్చయింది. ఇంక రేపు స్కూలు తెరుస్తారు అనగానే బుచ్చి స్నేహితుడు పోయాడు స్కూల్లో చేరడానికి. అది చూచి బుచ్చికి మరింత ఆత్రుత హెచ్చయి, నెమ్మదిగా నాన్న గదిలోకి వెళ్ళేడు. "నాన్నా?" అని నిల్చొన్నాడు వినయంగా.

"ఏంరా?..! ఏం కావాలి?" అని అడిగారు.

"ఏం లేదు నాన్నా! మీరు ఇదివరకు..."

"ఏమిట్రా. ఇదివరకు? పూర్తిగా చెప్పు"

"ఏం లేదు నాన్నా నన్నూ బాబునీ బళ్ళో చేర్పిస్తా నన్నారు?"

"ఓహో బళ్ళోకేనా? దానికేం? చేర్పిస్తానన్నాగా"

"ఎప్పుడు చేర్పిస్తారు నాన్నా?"

"ఎప్పుడు బళ్ళు తెరుస్తే అప్పుడే"

"రేపే తెరుస్తారట నాన్నా. రామూ అప్పుడే వెళ్ళాడు నాన్నా చేరడానికి."

"అరె...రె...రేపేనా స్కూలు తెరుస్తారు నాకు తెలియదే?"

"ఔన్నాన్నా...రేపే తెరుస్తారు"

"అయితే సరే. తెల్లవారుఝాము బండిలోనే

బయల్దేవదాం. బట్టలూ అవీ సర్దుకోండి ఈ లోపుగా" అని అనేసరికి బుచ్చి సంతోషానికి పట్టపగ్గాలు లేక పోయింది. వెంటనే వెళ్ళి బట్టలూ అవీ సర్దుకున్నాడు చిన్న చిన్న కూనిరాగాలు తీస్తూ

అప్పుడు బాబు ఎక్కడున్నాడో వచ్చేసరికి మర్నాడు తెల్లవారుఝాము బండికి బయల్దేరుతున్నామని సంతోషంతో చెప్పాడు. దానికి "సర్లే" అంటూ చిన్న నవ్వు నవ్వి బట్టల్ని సర్దుకోవడంలో నిమగ్నుడయ్యాడు.

ఆ రోజు సాయంత్రం బుచ్చి అక్కడి పెద్ద నీటి కాలువ దగ్గరకువెళ్ళి ఆలోచిస్తూ నీటివైపుచూస్తూ కూర్చొన్నాడు. ఆరోజు తనకు కలిగిన సంతోషాన్ని ఎవరితోనైనా చెప్పుదామనుకున్నాడు. కాని తనకున్న బాల్య మిత్రుడు పట్నం వెళ్ళిపోయాడు అప్పుడటువైపున ఒక మేకపిల్ల వెళ్తుంటే దాన్ని పట్టుకొని తనివితీర ముద్దులాడి "పట్నం చదువుకి వెళ్తున్నానే" అని చెప్పి ఇంటికి బయలేరాడు. ఇంటికి వెళ్ళే దారి పొడవునా సంతోషాన్ని పట్టలేక రాళ్ళని తీసుకుని అటూ ఇటూ రోడ్డు కిరుప్రక్కలా కొడుతూ ఇంటికి చేరాడు

ఆ రాత్రి భోజనంచేసి ప్రక్కమీద పడుకున్నాడే కాని నిద్ర పడితేకదూ? ఎంతసేపూ ఒకటే ఆలోచన పట్నంలో స్కూలు ఎలావుంటుందో? అక్కడి మాష్టార్లు ఎలా వుంటారో? అక్కడి వీధులెంత పొడవుగా

వుంటాయో? అక్కడి కార్లు రోడ్డుమీదే నడుస్తుంటే తను నడవగలడో లేదో? అక్కడి పట్నపు స్నేహితులు ఎలాంటివాళ్లు దొరుకుతారో? తనకంటే మంచి వాళ్ళతోనే స్నేహంచేసి బాగా ప్యాసు అవ్వాలి. ఎంత వేగం తెల్ల వారుతుందో'' అని. ఇంకా కోడి కూయలేదు. వెధవ కోళ్ళు అని విసుగుపడ్డాడు. అవి నాలుగు గంటలకి గాని కూయవని బుచ్చికి తెలుసు. అయినా ఆ వేళకి వేగం కోళ్ళని కూయమని దణ్ణం పెట్టుకున్నాడు. "దేవుడా! వేగం కోళ్ళని కూయమను. నేను పట్నం పోయి స్కూల్లో ప్రవేశించాలి. బాగా చదువుకోవాలి. బాగా చదివితే, పెద్ద చదువుల్ని గవర్నమెంటువారే చదివిస్తారట. పై దేశాలకికూడ పంపుతారట. అలాంటి భాగ్యం నాకు కలిగేట్లు దీవించు దేవుడా'' అంటూ ఎదురుగావున్న శంకరుని బొమ్మకి నమస్కరించాడు.

ఆఖరికి ఎలాగైతేనేం తెల్లవారుఝామున నాలుగు గంటలకి కోడికూత వినబడింది, బుచ్చికి. వెంటనే ప్రక్కమీదనుంచీ లేచి ఇంట్లో వాళ్ళందర్నీ అంటే నాన్ననీ, అమ్మనీ బాబుని లేపాడు బండికి వేళవుతుం దని. వాళ్ళ నాన్న పక్కమీదనుంచి లేస్తూ "అరె!..రె... మీ అమ్మ ఎప్పుడూ లేంది ఇంత ఆలస్యంగా నిద్ర పోయిందే!" అంటూ వేడి నీళ్ళు వేగం కాచమని తొందర పెట్టాడు బాబు తల్లిని.

వాళ్ళమ్మ నీళ్లు కాగబెట్టి ఇచ్చే లోపున తండ్రీ కొడుకులూ ముఖమూ కడుక్కొని స్నానం చేసారు. అప్పుడే వేడి కాఫీ తయారుచేసి ఇచ్చింది తల్లి. చక్కగా కాఫీ తాగేరు ముగ్గురూ. అప్పటికింకా చీకటి బాగానే వుంది. ముగ్గురూ బయల్దేరారు. బాబు "అమ్మా! వెళ్లి వస్తానే" అంటూ పెట్టి పట్టుకుని వీధిలోకి బయల్దేరినాడు. బుచ్చి తల్లిని విడువలేక విడువలేక కౌగలించుకొని "అమ్మా నన్నుదీవించి పంపవే. పెద్ద చదువు చదవమని" అన్నాడు. ఆ మాటకి తల్లి సంతోషించింది. చక్కగా చదువుకొని పెద్దవాడవయి జీవించు తండ్రీ అని దీవించి బుచ్చిని పంపింది.

ఇదంతా గుమ్మం దగ్గర నిల్చొని తండ్రి గమనిస్తూ "వీడు తప్పకుండా పెద్ద చదువు చదువుతాడు. చూడు నీ పెద్దకొడుకు అప్పడే ఎంత దూరం వెళ్లిపోయాడో! వాడు నీ ఆశీర్వచనం తీసుకోకుండానే వెళ్ళిపోతున్నాడు. వాడు మాత్రం ఏమీ చదవలేడు అని ఇక్కడే చెప్పేస్తున్నాను" అన్నాడు. బుచ్చి తల్లితో చెప్పి వెళ్తున్నానమ్మా అని నమస్కరించాడు. తను చూపుమేర వరకూ బుచ్చిని తల్లి, తల్లిని బుచ్చి చూసుకున్నారు. తరువాత కొంత సేపటికి చాలదూరం వెళ్లిన బాబుని కలుసుకున్నారు. అప్పుడు బాబు "అరె.....ఇంత ఆలస్యం

చేసారేం బుచ్చీ? త్వరగా నడు అన్నాడు. ఆమాటలు విన్న తండ్రి నవ్వుకున్నాడు.

సరిగ్గా టైముకి స్టేషనుకి చేరుకోగానే బండి వచ్చింది. అందరూ టిక్కట్లుకొని బండి ఎక్కారు. వాళ్లు చేసే ప్రయాణం ఒక పూట అవడంవల్ల బాబు చక్కగా కునుకు తీయసాగేడు. బుచ్చి మాత్రం కిటికీలగుండా పరుగెత్తుతున్న చెట్లనీ వాళ్ళతోపాటు వస్తున్న భూమినీ చూస్తూ కూర్చొన్నాడు. ఎంత బాగుందీ ప్రయాణం అనుకున్నాడు. మధ్యాహ్నం ఒంటిగంట వేళకి పట్నం చేరుకున్నారు. పూళ్ళోకి వెళ్ళి ఓ హోటల్లో భోజనం చేసేసి స్కూలుకి తీసుకొని వెళ్లారు వాళ్ళ నాన్న.

అదే రోజున స్కూలు మొదలు పెట్టారేమో హెడ్ మాష్టారు చాల పనుల్లో చిక్కగా మాట్లాడుతున్నారు. బాబుకి బుచ్చికీ ఫోర్తు ఫారంలో సీటిచ్చి హాస్టల్లోని ఫలానా నెంబరు గదిలోకి తీసుకువెళ్ళమని బంట్రోతుతో చెప్పారు.

హెడ్మాష్టారు చెప్పిన రూమ్కి బంట్రోతు వాళ్ళని తీసుకు వెళ్ళాడు. ఆ గదిలో నలుగురికి సరిపోయే నాలుగు మంచాలున్నాయి. రెండు మంచాలమీద దుప్పట్లు కొత్త నలిగాయి, షర్టూ, ఫాంట్లూ ఆ మంచాల మీదే పడివున్నాయి అందులో ఒక మంచంమీది గీతల చొక్కా బుచ్చిని ఎక్కువగా ఆకర్షించింది. అది నిజంగా

తన స్నేహితుడిదేనా? అలాంటి చొక్కాను మరవరికైనా వుందేమో అనుకున్నాను. బాబు గదిలో కాలు పెట్టే సరికి ఎప్పుడు ఎరుగని ఆనందంతో మొఖంలో కన బడింది. ఇద్దర్నీ గదిలోకి దిగబెట్టీ వాళ్ళ నాన్న "నాయనా బుచ్చీ! అన్నయ్య సంగతేమీ బాగుండ దేమో అని తోస్తుంది నాకు. కాస్త ఒక కంటితో చూస్తుండాలి. ఇది పట్నం జాగ్రత్తగా మసలాలి" అని అంటుంటే బాబుకి చిన్న కోపం వచ్చినా అణచుకున్నాడు. "బాబూ! మీరిప్పుడు వుంటున్నది వూరుకాని వూరు. అందులోకీ ఏ పల్లెటూరులాంటిది కాదు. పట్నం. జాగ్రత్తగా తిరగకపోతే ఏ బస్సుకిందో కారుకిందో పడక మానరు, చెడు అలవాట్లు ఏమీ చేసుకోకుండా వుంటే పెద్ద పెద్ద చదువుకి వెళ్ళాలని వుండడమే కాకుండా మంచి కీర్తి గణించుకుంటారు. ఆ కీర్తిని నా చెవులారా వినేటట్టు చేయడానికి మీరు ఇప్పటినుంచీ బాగా కష్టపడి చదువు కుంటే సంతోషిస్తుంటాను. ఇంక మరేం చెప్పలేను. ఏ ఒక్క సంవత్సరం మీలో ఎవరు తప్పినా వాళ్ళనిమళ్ళీ చది వించడం దుర్లభం. అందుకే కొత్త పాఠాలు చెప్పేరోజు నుంచీ బాగా చదువుతుండండి. ఇంక వెళ్తున్నా. అప్పు డప్పుడు వుత్తరాలు వ్రాస్తుండండి. మీకు పుస్తకాలూ అవీ హెడ్‌మాష్టారే ఇస్తారు. మీ హాస్టలుకి డబ్బు నేనే హెడ్ మాష్టారుకి పంపిస్తుంటాను."

"అలాగే నాన్నా....అలాగే....అని ఇద్దరూ ఒక్కమారే అన్నారు.

"ఇంక వెళ్తాను' అని తండ్రి ఎప్పుడూ తలల్ని నిమురనివాడు ఆ రోజున వాళ్లిద్దరి తలలూ నిమురుతుండగా "నాన్నా!" అని ఒక్కసారి కౌగలించుకొని అదోలా కనిపించాడు. ఎప్పుడూ పిల్లలమీద విచారంలేని తండ్రి ఆరోజున బుచ్చి కౌగలించుకోగానే కళ్లంటనీళ్లు తిరిగాయి. బాబుకూడా బుచ్చి ఏడుస్తున్నాడు కదా! అని కొంచెం ఏడుపు ముఖం మాత్రం పెట్టేడు. తరువాత బుచ్చి నొసటిని తండ్రి ముద్దుపెట్టుకొని అలాచూస్తూ నిల్చుండిపోయాడు.

అప్పటికి సాయంత్రం 4-30 గంటలయ్యిందేమో స్కూలు బెల్లు కొట్టేరు. హాస్టల్లోని పిల్లలందరూ హాస్టళ్ళకి వచ్చేస్తున్నారు. వూళ్లో ఇళ్లున్న వాళ్లిళ్ళకి వెళ్తున్నారు. హాస్టలుకి వచ్చిన వాళ్ళళ్ళో రామూ, విఠల్ కూడా వచ్చేరు విఠల్ రామూని ఎందుకో ఎగతాళి చేస్తూ రూంలోకి ప్రవేశించేసరికి, విఠల్ బాబుని గదిలోచూసి "అయ్....హాయ్....బాబూ! ఎప్పుడొచ్చావు? ఇంకా క్లాసుకు రాలేదేం? "అన్నాడు. "ఇప్పుడే వచ్చాను విఠల్...క్లాసులైపోతాయని రాలేదు. సరేకాని మరి నీ గదేది?" అని బాబు అడిగేడు. "ఈ గదే నాది. అదిగో నా మంచం" అన్నాడు. విఠల్ సంతోషంగా.

."బెష్. భలేగా కుదిరింది మనిద్దరికి గది." అని ఆశ్చర్యంగా ఇంకా ఏదో మాట్లాడుతుండగా రాముా బుచ్చిని కౌగలించుకొని "బుచ్చీ! నీకోసమే ప్రొద్దుటి నుంచీ చూస్తున్నా. ఇంతాలస్యం అయిందేం? రావడం?" అని ఆత్రుతగా అడిగాడు.

"ఈ వేళే స్కూలని మా నాన్నకి తెలియలేదు. నువ్వు వెళ్ళిపోవడం మా నాన్నతో చెప్పలేగాని జ్ఞాపకం రాలేదు యీ దినం స్కూలని. మరి నీగది ఎక్కడుంది?" ఈ గదే బుచ్చీ నాదికూడ." అంటూ రాముా బాబువంక "వచ్చావా!" అన్నట్టు చూశాడు.

రాముా తన పుస్తకాల్ని పెట్టెలో పెట్టేసుకొని "అలాగ వెళ్దాంరా బుచ్చీ అని బుచ్చి చేతిని పట్టుకొని లాక్కొని తీసుకొని వెళ్ళాడు. అలా స్కూలు వరండా, వాళ్ల క్లాస్‌రూమ్ అదీచూసిన తరువాత స్కూలు ఆట స్థలం అదీ చూసేటప్పటికి చీకటిపడింది. అప్పుడు వాళ్ళిద్దరూ పిచ్చాపాటీగా మాట్లాడుకుంటూ గదిలోకి వెళ్ళారు. అప్పటికి బాబూ, విఠల్ రాలేదు గదిలోకి. ఇంతలో భోజనానికి రమ్మనమని గంట కొట్టేరు. అందరూ భోజనశాలకి వెళ్ళారు. అందరితోపాటు బుచ్చీ రాముా కూడ వెళ్ళి భోజనంచేసి చేతులు కడుక్కొంటున్న సమయంలో బాబూ విఠల్ దిగవడి వీళ్ళందర్నీ చూసి వంటమనిషిదగ్గరకు వెళ్ళి భోజనం పెట్టమన్నారు.

వంటమనిషి వాళ్ళిద్దర్నీ ఎగా దిగా చూసి "క్రొత్తగా వచ్చి నట్టున్నారే! వచ్చిన మొదటి రోజునే ఇంత ఆలస్యంగా వచ్చారన్నమాట? ఇదిగో! చూడండి.... ఈ వేళ మీకు కొత్త కాబట్టి చెప్తున్నా. భోజనానికి గంట కొట్టేసరికి ఎందరైతే భోజనానికి వస్తారో వాళ్ళందరికీ భోజనం పెట్ట బడుతుంది. ఆ తరువాత ఒక్క పావుగంట కాదు కాదా! ఒక్క అయిదు నిముషాలు ఆలస్యంగావచ్చినా వారికి భోజనం పెట్టబడదు. ఈ వేళ మొదటి రోజు కాబట్టి మీకు భోజనం పెడుతున్నా. రేపట్నించి టైముకి రావాలి. లేకపోతే భోజ నం దొరకదు." అని భయపెంచి అన్నం వడ్డించాడు. "అమ్మ బాబయ్యో చచ్చాంరా దేవుడా!" అంటూ భోజ నాల దగ్గర కూర్చొన్నారు. బాబు, విఠల్.

ఈ సంభాషణంతా కిటికీ గుండా వింటున్న బుచ్చి రామూ "చూశావురా! బుచ్చీ....వచ్చిన మొదటి రోజునే ఆరంభించేరు ఆలస్యం భోజనానికి రావడం" అంటూ గదిలోకి వెళ్ళిపోయారు. తరువాత బాబూ, విఠల్ భోం చేసి విజిల్ వూదుకుంటూ గదిలో పడ్డారు

ఆ రాత్రి ఎవరూ చదవకుండానే పడుకున్నారు. స్నేహితులు రామూ బుచ్చి కలసి ఒకే దగ్గర పడు కోవడం వల్ల సంతోషంతో ఏవో కథలు చెప్పుకుంటూ నిద్రపోయారు.

మర్నాడు ఉదయం అందరూ లేచి వాళ్ళ క్లాసుకి వెళ్ళిపోయారు. క్లాసులో పిరియడు పిరియడుకూ మాష్టర్లు మారేవారు. ఆ వచ్చిన ప్రతీ మాష్టారూ ఒక్కొక్కరినే ఏ ఊరినుంచి వచ్చారనీ, వాళ్ళ తండ్రులకు ఏంపని అని ఇలాంటి ప్రశ్నలన్నీ వేసి వాళ్ళగురించి పూర్తిగా తెలుసుకున్నారు. వాళ్ళకి పరిచయమున్న చిన్న చిన్న ప్రశ్నలు వేసేవారు. వాటన్నింటికీ జవాబులు బుచ్చి వాళ్ళంతా బాగానే చెప్పారు. మొత్తంమీద ఆరోజు క్రొత్త పాఠాలుతో కాకుండా చిన్న చిన్న ప్రశ్నలుతోనే గడచిపోయింది.

సాయంకాలం అయింది. అంతా వాళ్ళ గదిలోకి వెళ్ళారు. "బాబూ! మేం బంతాటకి వెళ్తున్నాం. నీవు కూడ రా తోరా" అన్నాడు బుచ్చి.

"నేను బంతాట ఆడను. క్రికెట్ ఆడుతాను. నువ్వెళ్ళి బంతాట ఆడుకో" అని విశల్‌తో కలసి వెళ్ళిపోయారు.

బుచ్చి "సరేల్లే" అని రాముతో గ్రౌండుకి వెళ్ళి, బంతాట చీకటి పడేవరకూ ఆడుకొని వాళ్ళ గదికి వెళ్ళిపోయారు. భోజనం బెల్లు కొట్టగానే అందరూ భోజనాలకు చక్కగా ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

మర్నాడు క్లాసు అవుతుండగా హెడ్‌మాష్టారు తన గదికి బాబునీ బుచ్చిని పిలిపించి క్రొత్త పుస్తకాలు ఇచ్చి మిగిలిన పది రూపాయలనూ చెరో ఐదు రూపాయ

లూ పంచి ఏదైనా అవసరం వచ్చేటప్పుడు ఖర్చు పెట్టుకో మన్నారు. ఎవరి పుస్తకాలూ, ఎవరి డబ్బు వాళ్ళు తీసుకుని క్లాసుకి వెళ్ళిపోయారు. క్లాసు పూర్తిగా అయిపోయిన తరువాత బుచ్చి తన ఐదు రూపాయలూ మాత్రం జాగ్రత్తగా దాచుకున్నాడు. చక్కగా రెండు పూటలు భోజనమూ, రెండు పూటలు కాఫీ టిఫెను హాస్టల్లో చక్కగా ఇస్తుంటే ఇంక రూపాయిల ఖర్చు ఏమి టుంది బుచ్చికి.

ఆ రోజు రాత్రి బాబూ విఠల్ ఆలస్యంగా భోజ నానికి వచ్చి వంటవాణ్ణి దబాయించి వడ్డించమన్నారు. వంటవాడు "ఊ...ఊ..లాభం లేదు. అన్నం అంతా అయిపోయింది. చక్కగా వెళ్లి ఈ రాత్రికి పడుకోండి. ప్రొద్దున్నే కాఫీ త్రాగుదురుగాని" అని కోపంతో అన్నాడు.

"అయితే ఇప్పుడు అన్నం పెటవా? లేదా?" అని ఇద్దరూ కళ్ళెర్రజేసి వంటమనిషి వైపు చూస్తూ అన్నారు. "ఊ...ఊ...పెట్టనంటే పెట్టను." అని తన పనిని తాను చేసుకుపోతున్నాడు.

"ఆహా?...సరేలే...చూస్తాం మీ పని అంటూ" వాళ్ళు గదిలోకి వెళ్లేరు. జేబుల్లోగాని డబ్బులుంటే హోటల్ దారి పట్టేవారేకాని ఆ సమయంలో ఇద్దరి దగ్గ రున్న జేబులు ఖాళీ అయిపోయాయి. సిగరట్లు కాలుస్తూ

ఇష్టం వచ్చినట్లు తిరుగుతే రోజుకి ఐదు రూపాయలు కాదుగదా పది రూపాయలన్నా ఎందుకు ఖర్చు అవవు? అంచేత కడుపులో కాళ్లు పెట్టుకొని పడుకుందామని తిన్నగా పక్కమీదికి వెళ్ళారు. బాబు వచ్చిన ఒక్క ఘడియకు బుచ్చి "బాబూ భోజనం చేసావా?" అని అడిగేడు. "నీకేం?"

"ఏం లేదు. ఆలస్యంగా వచ్చావుకదా! ఆ వంట మనిషి అన్నం పెట్టేడా?" అని. "లేదు. వెధవ. బోలెడు అన్నం వుంచుకుని లాభంలేదు. పెట్టనంటున్నాడు. వెధవకి ఎంత పొగరు" అని పళ్లు పటపటమని కొరుకుతూ అన్నాడు. బాబు.

"అయితే ఇవిగో ఈ పూరీలు తిని మంచినీళ్ళు తాగేయండి" అని బుచ్చికి రాముకి వడ్డించిన పూరీలను బాబు కిచ్చేసు. బుచ్చి.

వాటిని కొంచెం పౌరుషంగానే బాబు అందుకొని విఠల్‌తో కలసి లగాయించేసు. ఆకలేగాని లేకపోతే పుచ్చుకొననివారే. వూరంతా తిరిగి వచ్చాడు కదా! తినకుండా ఎలావుండగలడు? ఆ రాత్రికి బాబూ, విఠల్ చాలీచాలని పూరీలు తిని నిద్రించారు.

రాత్రి జరిగిన సంఘటననుంచి వంటమనిషిమీద కోపం బాబుకీ విఠల్‌కీ ఎక్కువైంది. వాడిని ఎలాగైనా

ఏడిపించటకు నిశ్చయించుకున్నారు, ఇద్దరూ. అలాంటి పనులు చేయడం పగలు ఎవరైనా చూస్తారేమోనన్నభయం వాళ్ళకి. అందుకు రాత్రిమీద పని పట్టిద్దామనుకున్నారు. అందుచేత ఆరోజు రాత్రి వంటమనిషి నిద్రపోయే గది దగ్గరికి వెళ్ళి కిటికీలోంచి పడుకున్నాడో లేదో చూశారు. చక్కగా పడుకున్నాడు. అది అర్ధరాత్రి సమయమేమో అప్పుడు వంటమనిషి గుర్రుతప్ప మరేదీ వినిపించడం లేదు. బాబు కిటికీలోంచి వంటవాడిమీదకి సూటిగా రెండు రాళ్ళు విసిరాడు. వంటవాడికి మొలుకువ వచ్చింది. తరువాత బాబు ఓ రెండు పువ్వులు విసిరాడు. ఈ పువ్వులు చూసిన వంటవాడి గుండెలు గతుక్కుమన్నాయి. మళ్లీ రెండు కాయలు విసిరాడు బాబు. వంటవాడు మరీభయ పడి లేచి తలె రెత్తే సమయంలోనే పెద్దగాలి వీచి గదిలోని తలుపులన్నీ దబదబమంటూ కొట్టుకోసాగాయి. అప్పుడు వంటవాడి గుండె ఆగిపోవలసినంత పనైంది. కాని తను పరుచు కున్న దుప్పటి తీసేసి ముఖం లగాయితు కాళ్ళవరకూ కప్పుకున్నాడు.

అదేమంచి సమయమని బాబు "ఓఓ....ఓఓ.... ఆ....ఆం....ఊం....ఊం....ఓ....ఓ....భయం కల్పించే రకరకాల అరుపులు మొదలుపెట్టాడు. ఈ అరుపులకి వంటమనిషి దేముళ్ళకి దణ్ణాలు పెట్టాడు. అవన్నీ మీలో కొందరికి తప్పకుండా తెలుస్తాయి. రాత్రుళ్ళు

ఎప్పుడైనా తెలివి వచ్చేటప్పుడు వంటవాడికి మళ్లీ విని పిస్తే దేవుడ్ని ఎలా కొందరు తలంచుకుంటారో అంతకి రెండుమూడింతలు తలంచుకుంటాడు వంటవాడు. ఇలా కొంతసేపు భయపెట్టి, బాబు, విఠల్ పెళ్ళిపోయారు పడు కోడానికి. మరికొంతసేపటికి తెల్లవారింది. అందరూ లేస్తున్నారు. ప్రక్కల మీదనుంచి బాబు, విఠల్ కూడ లేచారు బద్ధకంగా.

అప్పటికి కాసులో కొద్ది కొద్దిగా పాఠాలు చెప్తు తున్నారు. రామూ, బుచ్చీ మొదటినుంచి శ్రద్ధగానే వింటు న్నారు. మాషారు చెప్పింది. విఠల్, బాబూ కలసి బాగా అలర్లు చేస్తున్నారు. మరొకరోజున రాత్రి బాబూ, విఠల్, వంటవాడి గదికి వెళ్లి మళ్ళీ భయపించారు. ఈ సారి భయపించడంలో చాలప్రత్యేకత కల్పించారు. ఏమిటంటే అది “బాబూ విఠల్ ఎప్పుడూ ఎంత ఆలస్యంగా భోజ నానికి వచ్చినా సరే మర్యాదగా లేదు అనకుండా వడ్డిస్తే నీకు ఈ అరుపులు ఏవీ వినిపించవు. ఏమాత్రం వాళ్ళని సరిగ్గా చూడకపోయావా? ఆ రోజు రాత్రే నీపని పట్టించే స్తాను. జాగ్రత్త. ఎవరిననుకున్నావో నన్ను పిశాచిని, కామినీని” అని భయపించారు. నిజంచెప్పాలంటే వంట మనిషికి చెప్పలేనంత పిరికి. ఏదో కుర్రాళ్ళ మీద మాత్రం భోజనాల దగ్గర డాబు చెలాయిస్తాడు అంతే....

అప్పటినుంచి వంటవాడు బాబునీ విశర్‌నీ ఒక కంటితోనూ మిగిలిన విద్యార్థులందర్నీ ఒక కంటితోనూ చూడ్డం మొదలుపెట్టాడు. ఇది చూచిన బాబుకి విశర్‌కి ఆశ్చర్యంతోపాటు ఆనందంకూడ వేసింది. అప్పటి నుండి ప్రతిరోజూ ఆలస్యంగా వస్తుండేవారు. అలాం టప్పుడు వంటవాడు మారుమాటాడక భోజనం పెట్టడమే కాకుండా ఎక్కువగా పూరీలూ, మీగడతోకాచిన పాలని తోడుపెట్టిన గట్టిపెరుగు వేసేవాడు. "మన ప్లాను భలేగా పారిందిరా!" అనుకుంటూ స్నేహితులిద్దరూ సంతోషించారు.

బుచ్చి వాళ్ళ క్లాసులో విజయ్ అనే అబ్బాయి క్రొత్తగా ప్రవేశించాడు. బుచ్చికీ రాముకీ స్నేహితు డయ్యాడు. విజయ్ బుచ్చికిమల్లే తెల్లని దేహచ్ఛాయ గలవాడు. విజయుని బట్టలు చూస్తే ప్రతీవాళ్ళూ అస హ్యించుకోకమానరు. క్లాసు మొత్తంమీద చూస్తే విజయే బీదవాడిలా కన్పిస్తాడు. మరి అది ఒక పట్టణమైనప్పుడూ, అది ఒక హైస్కూలైనప్పుడూ, కాస్త పెద్ద చదువు అయినప్పుడూ, బీదవాళ్ళూ చదవడం బహు తక్కువే విజయ్‌కి తండ్రి లేడు. తల్లి ఒక్కర్తే వుంది. వీళ్ళ ఇంట్లోనూ వాళ్ళ ఇంట్లోనూ పనిచేస్తూ, ఆ వచ్చిన డబ్బుతో కొడుకు పోషణా, చదువుకి వినియోగిస్తుండేది. ఒకొక్కప్పుడు తనుకూడ పస్తుండి విజయ్‌కి లేదన కుండా పెట్టేది. విజయుని తెల్లటి పాల బుగ్గమీదున్న

చిన్న పుట్టుమచ్చ మరింత అందాన్నిచ్చి బుచ్చిని ఆకర్షించింది. మొట్టమొదట క్లాసులో ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. తరువాత పీరియడ్‌లో నవ్వుకున్నారు. ఆ తరువాత పీరియడ్‌లో మాట్లాడుకున్నారు. ఇంక మాట్లాడుకున్న తరువాత స్నేహం. ఆ స్నేహం రోజు రోజుకీ చిన్న చెట్టు పెద్ద చెట్టులా పెరుగుతుంది. ఇంక చదువులో చెప్పాలంటే విజయ్ విజయంగానె చదువు తాడు. కాని బీదతనం. అందువల్లా హైస్కూలు జీతం హెచ్చు అవడంవల్లా రెండోనెల జీతం కట్టడానికి కష్ట మయ్యేసరికి విజయ్ స్కూలుకి వెళ్లడం మానేశాడు. విజయ్ స్కూలుకి రాకపోవడం బుచ్చికి చాల కష్టమని పించింది. అప్పుడు మాష్టారు ఎటెండెన్సు వేస్తున్నప్పుడు విజయుని పేరుకూడ పిలవడం మానేశారు. బుచ్చి మాష్టారు దగ్గరకు వెళ్ళి "మాష్టారూ! విజయ్ పేరు పలక లేదేమండి?" అని ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

"వాడు జీతం కట్టలేదు. అందుకు పేరు తీసే సాను. అంతే" అని జవాబు వచ్చింది మాష్టారు దగ్గర్నుంచి.

అప్పటికిగాని బుచ్చికి అసలు సంగతి తెలియ లేదు. వెంటనే మాష్టారునుంచి అనుమతి పుచ్చుకుని తన గదికి వెళ్ళి దాచిన అయిదు రూపాయిలూ తెచ్చి

విజయుని జీతంకట్టి పేరురిజిష్టరులో వేయించి విజయుని ఇంటికి స్నేహితులవల్ల తెలుసుకొని బయల్దేరాడు.

వాళ్లింటికి స్కూలుకి సుమారు రెండుమైళ్ళదూరం వుంటుంది. అంతదూరమా? అని అనుకోకుండానే బుచ్చి వాళ్లింటికి వెళ్ళాడు. అక్కడి చుట్టుప్రక్కల ఇళ్ళన్నీ పూరిళ్లే. అంతా బీదవాళ్ళు నివసిస్తున్నారు. తిన్నగా బుచ్చి గుడిసెకు వెళ్లాడు. కుక్కిమంచంమీద కూర్చొన్న తల్లిని జీతంకట్టి పేరు వేయించమని మారాం చేస్తున్నాడు చిన్న పిల్లాడులా. తల్లి కొడుకు మాటలు విన్పించుకోకుండా లోలోన ఏడుస్తూ పైకి మాత్రం 'లే బాబూ! కడతాను. ఏదో ఒకటి తాకట్టుపెట్టయినా రేపు కడతాను" అని అంటుండడం గుమ్మం దగ్గరే నిల్చున్న బుచ్చి అలకించి లోపలికి వెళ్ళి "విజయ్!....నీదే విజయం. నీ జీతం కట్టేసేము. నీపేరు వేసారు. ఇంక స్కూలుకి రావచ్చు' అంటూ విజయుని స్కూలికి లాక్కొని వెళ్లాడు బలవంతంగా.

మధ్యాహ్నం మొదటి పీరియడ్‌లో ఎటెండెన్సు పిలుస్తున్నారు. విజయుని పేరు తీసివేయకముందు మొదట్లోనే పేరుండేది. మాష్టారు పేర్లు వరుసగా పిలుస్తుంటారు. విజయ్ పేరు మాష్టారు పిలువలేదు. విజయ్ మాష్టారు వంకా, బుచ్చి వంకా అదోలా చూస్తున్నాడు. ఆఖరున

"విజయ్" అని మాస్టారు పిలచారు. విజయ్ ఒక్క-
సారిగా నవ్వుకున్నాడు.

విజయ్ ఆనందంతో "ప్రెజంట్ సార్!" అంటూ బుచ్చివంక ఆప్యాయంగా చూశాడు. మూడవ పీరియడ్ అవ్వగానే క్లాసులోని పిల్లలంతా బయటకు వెళ్ళగానే విజయ్ బుచ్చిని కౌగలించుకొని "నీవు చాలా మంచి వాడవు. నీ ఋణం ఎప్పటికీ మరచిపోను?" అని క్లాసులో నుంచి పైకి వచ్చాడు. కొంతదూరం బుచ్చిని విజయ్ దిగబెట్టాడు. ఇదంతా పక్కనే చూస్తున్న రాముకి చిన్న కలలా కన్పించింది. "ఇదంతా ఏమిటి బుచ్చీ?" అని రామూ అడిగాడు. అప్పటికి జరిగినదంతా బుచ్చి రాముతో చెప్పాడు.

బుచ్చి చేసినపనికి రామూ చాల సంతోషించి, తనేమీ ఉపకారం చేయలేక పోయానని విచారించాడు. కాని వెంటనే మెరుపులాంటి ఆలోచన తట్టింది. విజయ్ లాల్చి ఫెంట్లాలూ చిరిగిపోయినవేకదా? రామూకి క్రిందిటి వారమే వాళ్ళ నాన్నగారు నాలుగు జతల బట్టలు కుట్టించి పంపించారు. వాట్లో రెండు జతల్ని విజయ్‌కి ఇచ్చేయడానికి నిశ్చయించుకున్నాడు. ఆ తరువాత విజయ్ రామూలు కూడ స్నేహితులయ్యారు. ఒకనాడు విజయ్ వాళ్ళ గదికి వచ్చి కొంతసేపు మాట్లాడిన తరువాత విజయ్ వెళ్లిపోతున్నప్పుడు రెండు జతల బట్టలనూ

ట్రంకులోనుంచి తీసి విజయ్ చేతుల్లో పెట్టి "విజయ్....
నేను చేయగల వుపకారం ఇదే. స్నేహితుడి మాట
తీసెయ్యకుండా తీసుకోవాలి." అని అనగానే బుచ్చికి
ఆనందం కలిగింది. బట్టల్ని అందుకున్న విజయ్‌కి
ఆనంద భాష్పాలు రాలేయి. తనకి అంత మంచి స్నేహి
తులు దొరుకుతారని కలలోనైనా అనుకోలేదు. ఇన్నాళ్ల
వరకూ అంటే మూడవఫారంవరకూ హృదయపూర్వ
కంగా కష్టాల్ని తెలుసుకున్న స్నేహితులు లేరనే
చెప్పాలి. అటువంటిది ఏవూర్నుంచో వచ్చి స్నేహ
పూర్వకంగా కష్టాల్ని తెలిసికొని సహాయం చేస్తూన్న
స్నేహితులను చూచి ఆనంద భాష్పాలు రాల్చేడు.

వాటిని చూస్తూన్న బుచ్చి రాములు "అరె! రె!...
ఆడ పిల్లలా అలా ఏడుస్తావేం? విజయ్ ఏడవక. మనం
ముగ్గురమూ స్నేహితులం. మనలో ఎవరికి ఏకష్టము
వచ్చినా ఇతరులు సహాయం చేసుకోవాలి. ఈ మాత్రం
దానికి ఏడుస్తావేం?" అని బుచ్చి లాలనగా ఓదార్చాడు

"లేదు. బుచ్చీ! ఏడవడంలేదు. సరదాగా నవ్వుదా
మంటే ఏడుపు వచ్చేసింది. ఇంకెప్పటూ ఏడవనులే"
అని లేని చిరునవ్వును తెచ్చుకుని ఇంక వస్తానంటూ
యింటికి బయల్దేరాడు.

"వెళ్ళు విజయ్....ఇప్పటికే చాల ఆలస్యమైంది.
మీ అమ్మ నీకోసం ఎదురుచూస్తుంటుంది. వేగం వెళ్లు.



చాల దూరం నడవాలి." అన్నారు రాము, బుచ్చి.

"వెళ్తాను బుచ్చీ!........రాముా వెళ్తాను.... టా.....టా....."

"టా. . . .టా. . . ."మిత్రులు నవ్వుకున్నారు.

విజయ్ ఇంటికి బయల్దేరాడు. సంతోషంతోనూ, ఆనందంతోనూ? ఆహా! ఎంతమంచి స్నేహితులో! అని అనుకుంటుండగానే ఇంటి దగ్గరకు చేరాడు. గుమ్మం దగ్గర తన రాక కోసమే ఎదురు చూస్తూంది వాళ్ళమ్మ. విజయ్‌ని చూసి చూడగానే "ఏం బాబూ ఇంత ఆలస్యం" అని అడిగింది.

చిరునవ్వులొలికే పెదాలతో సంతోషం పట్టలేక "అమ్మా! ఇదిగో బట్టలు" అని చూపించాడు.. ఆ బట్ట లెక్కడివి? అని ఆశ్చర్యంగా అడిగింది తల్లి. స్నేహితుడిచ్చాడన్నాడు.

తల్లి ముఖం ఎర్రబడింది కోపంతో "నీ కెవర్రా స్నేహితులు? బట్టలిచ్చిన వాళ్ళెవరు? నిజంచెప్పు." అంది.

అంతవరకూ సంతోషంతోనూ, ఆనందంతోనున్న విజయ్ ముఖంలో ఇప్పుడు తల్లి పలికిన మాటలకి అతని ఆనందం, సంతోషం ఎగిరిపోయాయి. భయంగా చూచాడు తల్లిని. "ఊ. . .చెప్పరా? ఇన్నాళ్లు లేని స్నేహితులు ఇప్పుడు వచ్చారా? నిజంగా ఆ బట్టలెక్కడివో చెప్పు."

"ఔనమ్మా. నిజంగా స్నేహితుడే ఇచ్చాడు. ఆ రోజు

నేను నిన్న జీతం కట్టమని వేధిస్తున్నప్పుడు వచ్చినతన్ని తీసుకు వెళ్లాడే! అతడు గదిలోనే వుంటున్నాడు. తనకి ఎక్కువ బట్టలున్నాయట నా చిరిగిన బట్టల్ని చూసి స్నేహితులు ఎప్పుడూ ఒకే లాగుండాలి. అని బట్టల్ని బలవంతాన ఇచ్చారమ్మా! పుచ్చుకోక తప్పింది కాదమ్మా.

"అలా స్నేహితుల దగ్గర్నుంచి అన్నీ పుచ్చుకోవచ్చునురా?"

"పుచ్చుకోకూడదులే? అయినా మా స్నేహితులు మనలో మనకి భేదమేమిట్రా? ఎవరికైనా కష్టం వస్తే సాయం చేసుకోవాలి కానీ అంటుంటే పుచ్చుకోక తప్పింది కాదమ్మా"

"ఈ బట్టలిచ్చిన అబ్బాయికి ఇంకా బట్టలున్నాయా? అడిగింది. సగం కోపంతో.

"వున్నాయనే ఇచ్చాడమ్మా. మా స్నేహితులిద్దరూ చాల మంచి వాళ్ళు
ఒకరు జీతం కట్టేరు. మరొకరు బట్టలిచ్చారు. చూశావా? అమ్మా మనం బీదవాళ్ళమని తెలుసుకొని.

"అవున్నాయనా....వాళ్ళని ఒక సారి రేపు తీసుకురా కళ్లారా వారిద్దర్ని చూస్తాను." అని నెమ్మదిగా అన్నది.

"ఓ... సరేనమా రేపు తప్పకుండా నాతోనే తీసుకువస్తాను." అని హెచ్చు ధోరణిలోనే అన్నాడు.

బుచ్చికి రాముకి హాస్టలు భోజనాలు అంత సయిం చేవి కాదు. వాళ్ళ ఇంళ్లల్లో చేసినట్లు వంటలుండేవి కావు. బాబుకీ విఠల్‌కీ ఫస్ట్‌క్లాస్ మీల్సే దొరికేది. వంటమనిషి స్వయంగా వండుకొనే స్పెషల్ బియ్యంతోనూ, స్పెషల్ పెరుగుతోనూ ఒకటేమిటి ? అన్ని తిళ్లల్లోనూ ఫస్ట్‌క్లాసువే దొరికేవి. అందుకు మనుష్యులు ఏమీ తీయలేదు పుష్టి గానే వుంటున్నారు. రామూ, బుచ్చీ మాత్రం కొంచెం చిక్కారు.

మర్నాడు క్లాసులన్నీ అయిపోయినవి. బడిపిల్లలు ఎవరి స్నేహితులతో వాళ్లు జట్లుగా వెళ్తున్నారు ఇంళ్ళకి. రాముా, బుచ్చీ విజయ్‌లు కూడ కలిసి వెళ్తున్నారు.

ఏం బుచ్చి ఈ వేళ నాదో చిన్న పని చేసి పెట్టాలి, రామూ నీవు కూడాను.

"ఏంపనో చెప్పు విజయ్! తప్పకుండా చేస్తాం వీలైతే"

"ఇప్పుడు నాతోపాటు మా ఇంటికి రావాలి."

"ఓస్....దానికేనా? సరే వస్తాం" అని ముగ్గురూ కలిసి విజయుని ఇంటి ముఖం పట్టేరు.

ఇంటిదగ్గరకు వచ్చిన తరువాత "దేనికి విజయ్! ఇలా తీసుకొని వచ్చావు. అన్నారు స్నేహితులిద్దరూ.

ఏం లేదు బుచ్చీ! ఈ వేళ మా అమ్మ మిమ్మ ల్నిద్దర్నీ చూస్తానంది. అందుకే తీసుకొచ్చా" అన్నాడు విజయ్.

"ఆహా" అని ఇంట్లోకి వెళ్ళారు. తల్లి వాళ్ళకి కాళ్లు కడుక్కోవడానికి నీళ్ళిచ్చింది. ముగ్గురూ కాళ్ళు కడుక్కొని చాపమీద కూర్చొన్నారు. అప్పుడు నెమ్మ దిగా విజయ్‌తో "ఇదంతా ఏమిటి?" అని అడిగారు.

"ఏం లేదు. చిన్న విందుచేస్తుంది మా అమ్మ. అంతే" అన్నాడు విజయ్.

"ఇప్పుడిదంతా ఎందుకోయ్" అని అంటుండ గానే వాళ్ళమ్మ పళ్ళాలతో ఫలహారాలు పట్టుకొని రావడం చూసి గతుక్కుమన్నారు ఆ ఫలహారాలన్నీ సరాసరి రామూ బుచ్చీల దగ్గర పెట్టేసరికి "ఇదంతా ఎందు కండీ?" అని రామూ బుచ్చీ అడిగారు ఆశ్చర్యంగా విజయ్ తల్లి కళ్ళల్లోకి చూస్తూ.

"మీరు తింటారు నేనే స్వయంగా చేసాను నాయనా; సందేహించకండి." అందామె."

"పెద్దలు చెప్పిన మాటలు జవదాటకూడదు." అని ఫలహారాలు తింటుండగా "ఎలాగున్నాయి నాయనా ఫలహారాలు? మీ అమ్మ చేసినట్లున్నాయా?' అని విజ యుని తల్లి అడిగింది.

"బాగున్నాయమ్మా! అచ్చంగా మా అమ్మ వండి నట్టే వున్నాయి." అని బుచ్చి జవాబు చెప్పాడు.

అసలు మా అమ్మకీ వంటలు చేతకావు. అన్నిం టినీ మా అమ్మమ్మ చేతనే వండిస్తుంది. మా అమ్మమ్మ గాని లేకపోయిందా? మా పని...." అన్నాడు రాము.

"అంత బాగున్నాయన్నమాట!....సరే బాగా తినండి నాయనా" అని విజయుని తల్లి ఇంకా వాళ్ళ తల్లి దండ్రుల సంగతులూ అవీ తెలుసుకుంది.

ఫలహారం తినడమంతా అయిన తరువాత రామూ, బుచ్చి హాస్టలుకి వెళ్లిపోవడానికి లేచారు. "ఇంక వెళ్ళి వస్తామమ్మా" అన్నారు.

వెళ్లండి నాయనా, మా అబ్బాయి పూచీ అంతా మీదే!

"పూచీకేముందండీ, అంతా స్నేహమే కదా, విజయ్ గ్రౌండుకి వెళ్ళి ఆడుకుందాం వస్తావా? అన్నారు.

"బాబోయ్! అంత దూరం ఇప్పుడు నేను రాలేను రేపు ఆడుకుందాము. తిన్నగా హాస్టలుకి వెళ్ళిపొండి" అన్నాడు విజయ్.

"పోనీలే రానక్కర్లేదు. ప్రొద్దున్న కొంచెము హాస్టలుకి వచ్చేస్తావుకదూ.

'ఓ....వస్తా'

"టా...టా..." అంటూ రాము, బుచ్చీ వెళ్ళి పోయారు. వీళ్ళ ముగ్గురి స్నేహాలనీ చూసి విజయుని తల్లి లోన "ఎప్పుడూ ఇలాగే స్నేహంతో వీళ్ళ ముగ్గుర్నీ వుంచు దేవుడా" అని తలచుకుంది.

రోజులు దొర్లుతున్నాయి. క్లాసులో పరీక్షలు దగ్గర పడుతున్నాయి. రాము, బుచ్చీ విజయ్‌లు శ్రద్ధగా చదువు కుంటున్నారు. ఒకరికి తెలియనివి మరొకరికి చెప్పు కుంటూ. అలా చెప్పుకోవడంలోనైతేనేమి చదువు కోవడంలోనైతేనేమి విజయ్ కొన్ని కొన్ని రాత్రుళ్ళు అక్కడే నిద్రించేవాడు. అందుకు విజయుని తల్లి మరేం పట్టించుకొనేది కాదు. ఇప్పుడు తన కొడుకు బుచ్చీ, రాముాలవలే చక్కగా చదువుకొంటున్నందుకు సంతోష పడేది.

బాబూ విఠల్‌కి వీళ్ళు ముగ్గురూ శ్రద్ధగా చదువు కోవడం, స్నేహంగా వుండడం ఎక్కువగా రోత పుట్టించింది. అయినా అందులో తన తమ్ముడూ వుండ డంచేత ఏమీ చేయడానికి జంకేవాడు. వాళ్లు చదువుకోవ డం చూసి కొంచెం జంకి ఏదో చదువుకోండేవాడు విఠల్‌తోపాటు. చదువులో విఠల్‌కీ బాబుకీ ఎన్నో తెలి యని విషయాలుండేవి. అయినా వాటికి జవాబులు చెప్ప మని బుచ్చినిగాని వాళ్ల పార్టీవాళ్లనిగాని అడుగలేదు.

అలా అడిగితే వాళ్ళకి చిన్నతనం కాదూ? చిన్న తనం ఏమిటి లొంగికూడ తిరగాలనుకొనేవారు.

రానురాను ఒకపక్క తెలివైనవాళ్ళూ, సుబుద్ది కలవాళ్ళూ వుండడం, బాబుకీ వికల్‌కి ఏహ్యాభావం కలిగింది. సాధారణంగా ఇటువంటి భావం తెలివి తక్కువ వాళ్ళకి కలుగుతుంది. వాళ్ళు అంత బుద్ధిగా చదువు కుంటున్నారే, మనం కూడా వాళ్ళని చూసైనా బాగా చదువుకుందామని కాదు. ఆశ. వాళ్ళనికూడా మనలాగే చేయాలనీ, వాళ్ళ స్నేహాల్ని విడగొట్టాలనీ చూస్తుం టారు. అలాగే వికల్‌కి బాబుకీ ఆశ కలిగింది. ఆశ ఏమిటి? ఈర్ష్య కలిగింది.

అనుకున్న టే పరీక్ష రావడమూ కొన్ని పరీక్షలు అయిపోవడం కూడా జరిగింది. బుచ్చీ, రాముా, వికల్ పేపర్లు ఎంత చక్కగానో రాస్తున్నారు. బాబూకు, వికల్‌కీ పరీక్ష పేపర్లన్నీ కష్టంగానే తోచాయి పరీక్షలు కూడ పూర్తి అయిపోయాయి సెలవులు కొద్దిరోజులే ఈయ డంవల్ల వాళ్ళ మాష్టారు హాస్టల్లోని పిల్లలతోపాటు వూళ్లో కొందరు పిల్లలతో చిన్న ఎక్సకర్షన్ అంటే పికినిక్ వేశారు. ఎక్సకర్షన్‌కి వెళ్లేముందు బుచ్చి ఒక ఉత్తరం బాబు ఒక ఉత్తరం వ్రాసి ఒకే కవర్లో పెట్టి వాళ్ళ నాన్నకి పంపించారు.

పిక్నిక్ వెళ్లే విద్యార్థులంతా హుషారుగా స్టేషన్‌కి వచ్చారు. రైలుబండి పొడవుగా వుంది. అందులో ఆఖరి రైలుపెట్టె విద్యార్థులకని ప్రత్యేకించబడింది. గబ గబా ఎక్కారు విద్యార్థులంతా ఆ పెట్టెలోకి. అందులో రామూ, బుచ్చీ, విజయ్‌లు ఒక మూల చాల సంతోషంగా కూర్చొన్నారు. వాళ్ళు వెళ్ళబోయే పర్యటన ఎలాగుం టుందో అనుకుంటూ చిన్న కూనిరాగాలు తీస్తున్నారు. ఆనందంతో మరో మూలని బాబూ విఠల్ కూర్చొ న్నారు. రామూ, బుచ్చీ, విజయ్‌ల సంతోషాన్ని వీళ్ళి ద్దరూ చూడలేక పోతున్నారు. ఇద్దరి ముఖాలూ కోపా లతో నిండున్నాయి. వాళ్ళ స్నేహాన్ని ఎలాగైనా విడ గొట్టాలని.

గార్డు పచ్చ జెండాని వూపుతో విజిల్ ఊదాడు. బండి జుఫ్....జుఫ్ అంటూ కదిలింది. కొంతసేపు విద్యార్థుల పెట్టె అంతా నిశ్శబ్దం అయింది చాలమంది విద్యార్థులు కిటికీల్లోనుంచి తొంగి తొంగి చూస్తున్నారు. ఒక మేష్టారు లేచి అందరి మధ్యా నిలబడి "మీలో ఎవరైనా సరే చక్కని పాటలు ఒకరి తరువాత ఒకరు పాడండి. ఎవరెవరి పాటలు మాకు నచ్చుతాయో వాళ్ళకి ఫస్టు ప్రయిజు సెకండ్ ప్రయిజు, థర్డు ప్రయిజులు అని మూడు బహుమతులు ముగ్గురికీయబడతాయి." అన్నారు.

పాడగలిగిన వాళ్ళు పాడుతున్నారు. బుచ్చి, విజయులు కలిసి రామూని పాడమని ముందుకు తోసేరు. రామూ ఎప్పుడూ అంతమందిలో పాడనేలేదు. అయినా మిత్రుల ప్రోద్బలంవల్ల అందరిమధ్యా ఒక చక్కని పాట జంకులూ పాడేడు. పాట అయిపోయిన వెంటనే విద్యార్థులంతా చప్పట్లు కొట్టేరు. మాష్టర్లతో సహా! ఒక మాష్టారు మాత్రం వ్రాసుకుంటున్నారు పాటలు పాడిన వారి పేర్లవీని.

అంతమంది చప్పట్లు కొట్టేసరికి బుచ్చికి పాడదా మనిపించి స్నేహితుల్ని అడిగాడు "నేనూ పాడేదా?" అని.

"ఇంకా చూస్తావేం బుచ్చీ! ఊ....పాడూ.... మనలోనే ప్రయిజు రావాలి ఎవరికైనా" అని హుషారుగా రామూ, విజయ్‌లూ అన్నారు.

హుషారుగా వెళ్ళిన బుచ్చి అందరిమధ్యా వెళ్ళి ఒక పాట పాడేడు. అది ఎప్పుడూ ఎవరూ వినందే. అంటే సరిక్రొత్త పాటని వాళ్ళ ప్రయాణంమీదే కూర్చి పాడేడు, అప్పటి కప్పుడు, పాట అయిపోగానే అందరూ ఏకధాటిగా చప్పట్లు కొడుతున్నారు ఇద్దరు తప్ప. అంతలోనే ఏదో స్టేషను వచ్చేసరికి ప్రయాణీకులంతా ఏమిటూ? అని వీరి పక్కకి చూస్తు నిల్చున్నారు.

అందరి పేర్లవలే బుచ్చికూడ మాస్టారు తనపేరు చెప్పి తన స్థలంలో కూర్చొనేసరికి రాముా, విజయ్ "భలేగా పాడేవు బుచ్చి! మన్దే, ఖచ్చితంగా ఒక ప్రయిజు మన్దే" అన్నాడు.

ఇదంతా చూస్తున్న బాబూ, విఠల్‌కి కోపం హెచ్చయింది. వాళ్ళే పాడడం ఏమిటి? మనలోనె పాడాం అనుకొని" వెళ్ళు విఠల్ నీవు కూడా ఒక కత్తిలాంటి పాటపాడు" అన్నాడు.

"బాగా పాడ్డం రాదే"

"పర్వాలేదు. ఎలాగున్నా పర్వాలేదు. ఊ...."అని ముందుకు తోయబోయాడు.

"ఆ....నేనా?"

"ఆ....నీవే....ముందు వెళ్ళి ఏదో ఒకటి పాడు.

..ఏది పాడ్డానికి జ్ఞాపకం రాలేదే" ఆ...పాడు తాను. అల్లా సినిమాలోని కామిక్ పాటపాడి అందర్నీ ఎలా నవ్విస్తానో చూడు" అని అందరిమధ్యకూ వెళ్ళి పాట పాడ్డం మొదలుపెట్టేడు. ఒకటి రెండు చరణాలు బాగానే పాడాడు. మూడో చరణానికి వచ్చేసరికి బెక్కుతూ పాడి నాల్గో చరణం ఏమిటా అని ఆలోచిస్తుంటే తోటి విద్యార్థులంతా ..ఛీ...ఫో...గొప్పగా పాడేవు. రాగమే బాగులేదు. ఏదో చరణాలన్నా విందామంటే అవీ రాలేదు. వెధవకి.'' అని అందరూ ఛీఛీ అని వెక్కిరించినారు.

విఠల్ కోపంగా అందరివైపు చూస్తూ వెళ్ళి తన స్థలంలో కూర్చొన్నాడు. కూర్చొగానే "ఛీ వెధవా... నాలుగు ముక్కలు పాట పాడలేక పోయావు. మనలో ఎవరూ పాడలేకపోయాం. రెండు ప్రయిజులు కచ్చితంగా వాళ్ళే కొట్టేస్తారు. చెప్తా వాళ్ళపని." అంటూ వాళ్ళని ఎర్రగా చూశాడు. ఒక్క బాబే కాదు. విఠల్ కూడ కోపంగా చూశాడు. "సమయం రానీ చెప్తా వాళ్ళపని అని విఠల్ పళ్ళు పట పట కొరికేడు.

ఆఖరికి ఎలాగైతేనేం కులాసాగా, హాయిగా, సంతోషంగా వాళ్లు అనుకున్న వూరికి చేరుకున్నారు. వెళ్ళి వెళ్ళగానే మాష్టార్లు కొందరు చక్కగా భోజనం వండడంలో నిమగ్నులయ్యారు. ఇప్పుడు వాళ్ళున్న బస ఒక స్కూలు. అందరికీ విశ్రాంతికని ఒక పెద్ద హాలులాంటది ఇచ్చారు. విద్యార్థులు విశ్రాంతి తీసుకోడానికి బదులు గుంపులు గుంపులుగా అక్కడికి దగ్గర్లోనే వున్న దుకాణాల్ని చూశారు కొంతసేపు. తరువాత బసకి వెళ్లేసరికి మాష్టర్లు వంటకాలు పూర్తిచేసి వడ్డించడానికి తయారుగా వున్నారు. విద్యార్థులంతా కూడి వెంటనే వెళ్ళి లోని భోజనాల పంతిలా వరుసగా కూర్చొన్నారు. ఒకొక్కక్క మాష్టారు ఒంక్కొక్క వంటకాలు వడ్డించ సాగేరు. అలాగ భోజనాలు విద్యార్థులందరికి వడ్డిస్తుంచే బుచ్చికి ఏదో సంతోషం కలిగింది. "ఆహా! ఎంత

చక్కగా అందరమూ ఒకే పంక్తిలో భోంచేస్తున్నాము".
అనుకొని సంతోషాన్ని పట్టలేక చిన్న నవ్వు నవ్వేడు.
ఇదంతా గమనిస్తూన్న "ఏం బుచ్చీ అంత సంతోషంగా
వున్నావు?" అడిగేడు.

"ఔనౌను. మంచి హుషారెక్కాడు అబ్బాయి."
అన్నాడు ప్రక్కనున్న రామూ.

"ఏం లేదు విజయ్ ఏదో జ్ఞాపకం వచ్చి నవ్వేను.
అది సరేకాని ఇప్పటికి మనం చేసిన ప్రయాణం ఎలా
వుంది?" "చాలా సరదాగా వుందికదూ!" అన్నాడు
విజయ్.

"భలేగా వుందికదూ బుచ్చీ" అన్నాడు రామూ.

"ఔను. అందుకే ఆ సంతోషాన్ని పట్టలేక
నవ్వేను."అని బుచ్చి అన్నం కలుపుకుతిన్నాడు. అందరూ
భోజనం చేస్తున్నారు. రామూ, భోజనందగ్గర కూర్చుంటే
చాలు ఐదు నిముషాల్లోగానే తినేసే మనిషి. అందుచేత
వేగం తినేసి "ఊ వేగం తినండి....ఇంకా ఎంత సేపు
తింటారు? ఎక్కడికో మాస్టారు ఇప్పుడుతీసుకువెళ్తారుట."
అన్నాడు రామూ ధీమాగా తొందరపెడుతూ.

రామూ తొందర పెట్టడంవల్లో మరిదేని వలనో
కాస్త వేగం భోంచేశారు బుచ్చీ విజయ్‌లు. అంతట్లో
వీళ్లతో బాటు తోటి విద్యార్థులంతా భోంచేసి చేతులు
కడుక్కొని పైన వరండాలో అందరూ తిరుగుతున్నారు.

ఈ లోగా మాష్టర్లు అందరూ కాస్త ఏమిటి? చక్కగా పుష్టిగా భోంచేశారు. అప్పుడు రెండు పెద్ద లారీలు ఆ స్కూలు దగ్గరికి వచ్చాయి వాళ్ళందరిని ఎక్కడకో తీసుకుని వెళ్ళడానికి లారీల్లో అందరూ ఎక్కారు. ముందుగా వెళ్తున్న లారీలో బుచ్చీ, రామూ, విజయ్ మరికొందమంది విద్యార్థులూ వెనుక లారీలో బాబూ, వికర్ మిగిలిన విద్యార్థులూ ఎక్కారు. మాష్టర్లు, డ్రైవర్ల ప్రక్కన సీట్లలో కూర్చొన్నారు. లారి తరువాత లారీ రయ్‌మని బయల్దేరి వెళ్తున్నాయి. ఎక్కడికి వెల్తున్నారో తెలుసా? వాళ్ళు వెళ్ళబోయేది కొండమీదనుంచి. అంటే కొండలమీదికి ఎక్కడానికి అనుకూలంగా వుండడానికి రోడ్డు వేస్తారు. ఆ రోడ్డునే ఘాటీ అంటారు. వాళ్ళ లారీలు ఇప్పుడు ఘాటీ ఎక్కుతున్నాయి. ఘాటీ ఎక్కుతుంటే ఈ ప్రక్కా ఆ ప్రక్కా చెట్ల పొదలే. అంతా లోయల్లాగే కనుపిస్తుంది. అటువంటి రెండు పెద్ద ఆ ఘాతాల మధ్య వేసిన రోడ్డుమీదనుంచి పోతున్నారు. వాళ్ళు. లారీలు ఘాటే ఎక్కుతుంటే వెళ్ళవలసిన రోడ్డంతా ఆకాశం కంటికి కన్పించేటట్టు వుంది. అలా కన్పించడంతోనే విద్యార్థులందరికీ మొదట్లో కళ్ళు తిరగడమే కాకుండా కొంచెం భయం కూడ పుట్టుకొచ్చింది. అయినా సాహసవీరులు విద్యార్థులు కదా! కొంచెం అల

వాటు పడిపోగానే మాయూరాలై పాటలు పాడ్డం మొదలు పెట్టారు.

మొదట వెళ్తున్న లారీ వాళ్ళకీ వెనక వెళ్తోన్న లారీవాళ్ళకి పాటల పోటీలు పడ్డాయి ఎవరి నోట్లోనుంచి వచ్చే పాట వాళ్ళు పాడుతూ చప్పట్లు కొట్టుకొంటూ వెళ్తున్నారు.

కొంతసేపు బుచ్చికూడ అలా పాడిన వాడేకాని ఛటుక్కున పాటమాని ఒక ప్రక్క చూస్తుంటే రాముా విజయ్ లు గాభరాపడి "ఏం బుచ్చీ అందరూ పాడుతుంటే నువ్వేం పాడకుండా అలా చూస్తున్నావ్? అని దీనమైన మనస్సుతో అడిగాడు

"ఏం లేదు. చూడండి! అల్లా దృశ్యాన్ని చూస్తుంటే ఇక్కడే వుండిపోవాలనిపిస్తుంది నాకు. మీకెలా అనిపిస్తుందో చెప్పండి" అని ప్రేమతో చూపెట్టాడు ఆ దృశ్యంవైపు.

ఆ దృశ్యం ఎంతోచక్కగా వుంది.కొండలు మెట్లు దిగుతున్నట్టు వరుసగా కన్పిస్తున్నాయి.పై కొండలు చాల ఎత్తుగానూ దాని తరువాత కొండ మొదటిదానికంటే కొంచెం ఎత్తు తక్కువగానూ, దాని తరువాత కొండ వాటికంటే చిన్నదిగానూ, వున్నాయి. ఇలాగే మేడ మెట్లలాగ కొండలన్నీ కన్పించాయి. ఆ కొండలకి ఇవతల ప్రక్కని పెద్ద అఘాతంలాంటి నిడివైన లోయ, ఆ

లోయ మధ్యగా ప్రవహిస్తున్న సన్నని నీటి ప్రవాహం, ఆ లోయ కిరుప్రక్కలా పొడవైన ఈతచెట్లు వరుసగా పేర్చినట్లున్నాయి.

ఆ అద్భుత దృశ్యాన్ని రాముా విజయ్‌లు చూసి "చాలా బాగుందికదూ బుచ్చీ" అన్నాడు.

"ఔను. అందుకే నేనలా చూస్తూ వుండిపోయాను." అన్నాడు బుచ్చి. అలాగే వాళ్ళు వెళ్తున్న దారి పొడవునా అనేకరకాల దృశ్యాలను చూస్తూ తన్మయత్వంపొందేవారు ఎప్పుడైనా ఎవరైనా అటువంటి ప్రదేశాన్ని చూస్తూ వారి మనస్సులో ఎటువంటి ఆలోచనలతో వుంటారో అలాగును. అప్పుడు వాళ్ళ లారీలకి చటుక్కున బ్రేకులు పడ్డాయి. అంటే వాళ్ళు అనుకున్న ప్రదేశానికి వచ్చేరన్నమాట. అందరూ లారీలమీదనుంచి దిగేరు. మేష్టారు తీసుకొని వెళ్ళిన ఒక విశాలమైన చావిట్లోకి వెళ్ళి వరుసగా కూర్చోబెట్టి టిఫిన్ పెట్టి కాఫీ ఇచ్చారు. అప్పటికి సాయంకాలం దాటింది. ఆ కొండల ప్రదేశాల్లో సాయంత్రం తరువాత మనుష్యులు నడవరు. అందువేత వీళ్ళంతా అక్కడే రాత్రి భోజనంచేసి పడుకున్నారు.

మర్నాడు పొద్దున్నే అంతా కాఫీలు తాగి అక్కడవున్న వాటర్ ఫాల్సు దగ్గరికి వెళ్లారు. ఎత్తుకొండ మీదనుంచి క్రిందకి నీళ్ళు పడుతున్నై. అమ్మ బాబోయ్! మొట్టమొదట ఆ వాటర్ ఫాల్సుని చూస్తే పిల్లలందరికీ

కళ్ళు తిరిగి నట్టనిపించింది. అదంతా రాతి ప్రదేశం. చక్కని నల్లరాళ్ళు. అవన్నీ అనేక సైజుల్లో, అనేక ఆకారాల్లో ఎత్తుగా, పొట్టిగా, ఏపిల్ పళ్ళు ఎంత నున్నగా వుంటాయో అలాగ రాళ్ళన్నీ నున్నగా వున్నాయి. మాష్టర్లు పిల్లల నుద్దేశించి "జాగ్రత్త! ప్రమాదం. నీట్లో దిగవద్దు" అని హెచ్చరించేరు.

అలా మాష్టర్లు హెచ్చరించినా చిలిపి చేష్టలు చేసే కుర్రాళ్లు కొందరు నీళ్ళల్లోకి దిగక మానలేదు. కెమేరాలు గలవాళ్లు అక్కడి ప్రకృతి దృశ్యాలని ఫొటోలు తీయడంలో నిమగ్నులయ్యారు. భయస్తులు ఓ పెద్ద రాతి బండమీద కూర్చొని వాటర్ ఫాల్సుని తదేక దృష్టితో చూస్తూ ఆనందిస్తున్నారు. మరికొందరు ఆ దృశ్యాలని ఎవరికీ తోచినట్లు వాళ్ళ కాగితాలమీద బొమ్మలు గీస్తున్నారు. "జాగ్రత్తగా మసలండి అబ్బాయిలూ! ప్రమాదకరమైన చోటు. ఏమాత్రం కాలు జారినా నీళ్లలోకి పడిపోతారు." అని అప్పుడప్పుడు మాష్టర్ల అరుపులు మాత్రం వినిపిస్తున్నాయి.

అదంతా ఎవరూ వినిపించుకోకుండానే ఎవరి పనుల్లో వాళ్లు నిమగ్నులైయున్నారు. విజయ్ ఏదో బొమ్మ గీస్తున్నాడు. బుచ్చి మనస్సులో ఏదో ఊహించుకుంటూ చుట్టూవున్న మనోహర దృశ్యాలను చూస్తూ కూర్చొన్నారు. రాజు నీట్లో ఆడుతున్నాడు. అక్కడి

నీటి ప్రవాహవేగం ఎక్కువగా వుంది. ఒడ్డుకీ ప్రవాహానికి మధ్య ఒక పెద్ద రాయి వుంది. ఆ రాతిమీద బాబూ, విఠల్, మరికొందరు స్నేహితులూ కూర్చొన్నారు. ఆ రాతి మీదకు గెంతుదామని రామూ గెంతాడు. కాని దైవసహాయం లేకపోవడంవల్ల రాయి నున్నగా వుండడంచేతనూ రామూ కాలు వేసేసరికి జారి నీట్లో పడికొట్టుకుపోతున్నాడు. మనిషి ఉక్కిరి బిక్కిరై పోయాడు. మళ్ళీ దేవుడికి దయ కలుగబట్టేకాబోలు ప్రవాహంలో కొట్టుకుపోతున్న రామూకి ఒక రాయి అడ్డు వచ్చింది. అక్కడగాని ఆ రాయి లేక పోతే రామూ పని అయిపోవలసిందే. ఆ రాయి ప్రక్కనే ఓ అఘాతంలోకి నీరు జోరుగా ప్రవహిస్తుంది. అది చూసిన రామూ హడలిపోయి "బుచ్చీ!" అని గట్టిగా పిల్చాడు. హూ ఆపిలుపు ఎవరికని వినబడుతుంది? అంత ప్రవాహ శబ్దంలో! అలా చాలా సార్లు బుచ్చినీ, విజయ్‌నీ పిల్చాడు. ఎవరికీ ఆ పిలువు వినబడలేదు.

ఇక్కడ విజయ్ తన బొమ్మ పూర్తి చేసుకొని బుచ్చి దగ్గరకొచ్చి "బుచ్చీ రామూ ఏడి?" అని అడిగాడు.

"ఏమో! ఇక్కడెక్కడో వుంటాడు" అని అక్కడంతా చూసి స్నేహితుల్ని అడిగాడు రామూ ఏడని? అందరూ ఏమీ తెలియదన్నారు. బాబూ విఠల్‌ని కూడ

అడిగాడు. "ఇందాక నీట్లో ఆడ్డం చూశాం" ఇప్పుడెక్క-డున్నాడో తెలీదు" అన్నారు. అప్పటికీ కన్పించకపోతే బుచ్చి. విజయ్‌ల గుండెలు హెచ్చుగా కొట్టుకొని భయపడి ప్రవాహం ఒడ్డంట "రామూ, రామూ, అనుకుంటూ వెళ్ళారు అప్పటికే రామూ కనిపించలేదు. ఏమైపోయాడో అని ఏడుపు ముఖం పెట్టేరు స్నేహితులిద్దరూ. అప్పుడు వాళ్ళిద్దరూ ఒక సారిగా "రామూ"! అని అరచారు ప్రవాహంలో వున్న రామూ ఈ పిలుపువిని "బుచ్చి! అని రామూ పిల్చేడు. రామూ పిలుపు విని చుట్టూ కలియజూసే ప్రవాహం మధ్యలోని రామూ కనబడేసరికి విచారంపోయి సంతోషం వచ్చింది. స్నేహితులిద్దరికీ. కాని రామూని ఆ ప్రదేశంనుంచి తీయడం కష్టమే అనుకుని "బుచ్చి" నువ్విక్క-డేవుండు. రామూని మనం వెళ్లి తీసుకురాలేం. ప్రవాహం ఎంత హెచ్చుగా వుందో చూశావా? నేను వెళ్లి మాష్టార్లమీద ఓణీలు రెండు తీసుకొని ఒకదానికికట్టి ముడివేసి తీసుకొస్తా" అంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళి ఇద్దరి ఓణీలు గబగబలాక్కొ-ని ఒకదాని కొకటి ముడివేసుకుంటూ పరుగెత్తుకుంటూ బుచ్చి దగ్గరకు వెళ్ళాలనుకుంటే మాష్టర్లూ, తోటి విద్యార్థులు కంగారు పడుతూ విజయ్ వెంటవెళ్లారు. కొందరు మాష్టర్లు బుచ్చి ప్రక్క-గా నిలబడి నోరెళ్ళబెట్టి చూస్తూనే వున్నారు .రామూవైపు అంతేకాని సహాయం

అంటూ ఏదీ చేయలేకపోయారు. విజయ్ ఆ ఓణీన్ని రామూవైపు జాగ్రత్తగా విసిరేశు. చాలసేపటివరకుగాని రామూ ఆ కొసని అందుకోలేకపోయాడు. అందుకున్న తరువాత "గట్టిగా పట్టుకో రామూ జాగ్రత్త" అని బుచ్చీ, విజయ్‌లు హెచ్చరించారు.

"గట్టిగానే పట్టుకున్నా" అని రామూ అనేసరికి బుచ్చీ, విజయ్‌లు జాగ్రత్తగా ఒక్క ఊపున లాగి ఒడ్డుకు చేర్చారు. ఒడ్డుకు రాగానే రామూ, బుచ్చీని విజయ్‌ని ఒక్కసారి కౌగలించుకొని బుచ్చీ ఆ రాయి గాని అడ్డులేకపోతే నాపని అయిపోవును." అని ఆ రాతిని ప్రేమతో చూపిస్తుండగా బాబూ, వికల్ వచ్చి అరెరె! పాపం ఎలా పడిపోయాడు?" అన్నారు వెనుకనుంచి.

మాష్టర్గూ "వెధవా! నీట్లో ఏం సరసాలు చేశావ్? దేవుడి దయవల్ల బ్రతికేవు. లేకపోతే మీ వాళ్ళకి ఎలా చెప్పడం? రక్షించావురా బాబూ! అంతేచాలు పద" అంటూ అక్కణ్ణుంచి బయల్దేరి వచ్చిన దారివెంబడే లారీలమీద వెళ్ళారు వాళ్ళుంటున్నబసకి. కొందరు మాష్టర్లూ మరెప్పుడూ అలాంటి ప్రమాద స్థలానికి తీసుకు వెళ్ళకూడదు, అని అనుకుని అక్కడికి దగ్గరున్న మరి కొన్ని వింతలూ విశేషాలు చూసుకుని రైలెక్కారు, స్వస్థలానికి.

ఈ సారి తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు ఎవరి ముఖాల్నీ కళలు లేవు. ముఖ్యంగా బుచ్చికి, రామూకీ, విజయ్‌కీని. మిగిలినవాళ్ళు మనస్సులో "వెధవ రామూ గాడినుంచే ఇంకా చూడవలసినవీ అవీ సరిగ్గా చూడ లేదు." అని ఏదో అనుకున్నారు. పాను మరి. వాళ్ళంతా బాధపడరూ? ఎంతో సరదాగా వెళ్ళి చూస్తున్న వాళ్లకి రామూనుంచి మాష్టర్లకీ కూడ విరక్తి కలిగింది. అయినా పిల్లల్ని ప్రమాద స్థలాలకి ఎప్పుడూ తీసుకొని వెళ్ళకూడదు అని నిక్కచ్చిగా చెప్పుకున్నారు.

రైలు దిగుతుండేటప్పుడు ఒక మాష్టారు మనం చూచివచ్చిన ప్రదేశాన్ని చక్కని వ్యాసంక్రింద, విహారం, అనే హెడ్డింగుతో వ్రాసి అందరూ నాకిస్తే బాగా వ్రాసినవారికి బహుమానం" అని చెప్పారు. స్టేషను రాగానే బండిలోనుంచి దిగి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళి పోయారు. హాస్టలుకి వెళ్ళవలసిన కుర్రవాళ్ళు హాస్టలుకి వెళ్ళారు.

రాము గదిలో ఆలోచిస్తుండగా బుచ్చి "ఇంకా విచారం దేనికి రామూ? అయిపోయిందేదో అయి పోయింది. మాష్టారు వ్రాయమన్న వ్యాసం వ్రాసి బహు మతి పొందాలి. తెలుసా" "అన్నాడు.' తప్పకుండా బహుమతి పొందుతా కానీ నానుంచి మిగిలినవాళ్ళకి చాల ఇబ్బంది కలుగజేసేనుకదూ బుచ్చీ!" "ఇబ్బంది కేముంది.

ఇప్పుడు కాకపోతే మరొకప్పుడైనా చూడక పోతారు కనుకనా? ఇంకా ఆ ఆలోచనలే ఎందుకూ? ముందా వ్యాసం నాకు రాసి చూపించూ" అని బుచ్చి గదమాయించాడు.

రాముూ కాగితం పెన్నూ తీశాడు వ్యాసం వ్రాయడానికని. సగం రాత్రి అయ్యేటప్పటికి వ్యాసం పూర్తిగా వ్రాసి నిద్రపోతూన్న బుచ్చిని లేపాడు, బుచ్చి లేచాడు విసుక్కోకుండా తన ప్రాణస్నేహితుడు లేపబట్టి మరెవరైనా లేపితే అంత మంచి నిద్రల్లో కసిరేవాడే! అప్పుడు బుచ్చి దాన్ని చదివి "బాగా రాసేవ్ రాముూ! ఖచ్చితంగా ప్రైజు వచ్చితీరుతుంది. ఇప్పటికే చాలా రాత్రయ్యింది. ఇంక పడుకో రాముూ!" అన్నాడు బుచ్చి. పెన్నూ, పుస్తకం మూసేసి లైటు ఆర్పేసి పడుకునాడు,

ఆ మర్నాడంతా స్కూలుకి సెలవే! అందరూ ఎవరి గదుల్లో వాళ్లు కూర్చొని కులాసాగా చేసివచ్చిన ప్రయాణాన్ని గురించి, చూచివచ్చిన ప్రదేశాలనుగురించి మాట్లాడుటకు బుచ్చి గదిలో బుచ్చీ, రాముూ విజయ్‌లు మాట్లాడుకుంటూ కాలక్షేపం చేసేరు. బాబూ, విఠల్ ఎక్కడికో వెళ్లి రాత్రికిగాని గదికి చేరుకోలేదు. మర్నాడు బడి. ఆ రోజున వ్యాసాలు వ్రాసిన వాళ్లంతా తెచ్చి మాష్టారుకిచ్చారు. మేష్టారు ఒక్కొక్కటే శ్రద్ధగా చదివి బాగా వ్రాయబడిన వ్యాసాన్ని జాగ్రత్తగా, దాన్ని మిగిలినవాటిని టీచర్సు రూమ్‌లో దాచేరు. బహుమతి

పొందిన వ్యాసం వ్రాసినవారి పేరు త్వరలో ప్రకటిస్తా మన్నారు.

రోజులు గడుస్తున్నాయి. పరీక్ష పేపర్లుకూడ యివ్వ బడుతున్నాయి. వాటన్నింటిలోనూ ఫస్ట్, సెకండు, థర్డ్ మార్కులు. అన్నీ రాముా, బుచ్చి, విజయ్‌లు ఈ ముగ్గురుల్లోనే వచ్చాయి. వీళ్ళకి వచ్చిన మార్కుల్ని బాబూ విఠల్ చూడలేకపోయేరు. "చెప్తా వీళ్ళకి మళ్ళి సారి మార్కులు ఎలా బాగా వస్తాయో చూస్తాం" అని బాబూ, విఠల్ అనుకున్నారు.

ఆ రోజే ఏదో పాఠశాలవార్షికోత్సవం అవుతుం దన్నారు. అందులోనే వ్యాసం బాగా వ్రాసిన వారిపేరు పిలిచి బహుమతి ఇవ్వబడుతుందని ముందుగానే తెలియ పరిచారు. అందుకే బహుమతి పుచ్చుకోడానికి గెలుస్తే అంటే బాగా వ్రాస్తే వ్యాసాలు వ్రాసి ఇచ్చిన ప్రతీ వాళ్ళూ కూడ చక్కని నిక్కర్లూ, తెల్లటి షర్టులూ, వేసుకొని బాగా ముస్తాబై ఆరోజున వచ్చారు. సభా వేదిక మీదకి అధ్యక్షులూ మున్నగువాళ్ళు వచ్చి ఏవో విద్యాబోధక విషయాలనుగురించి మాట్లాడుతుండే వ్యాసం వ్రాసిన కుర్రవాళ్లు "ఇంకా ఎప్పుడు పిలుస్తారో మన పేరు!" అనుకుంటూ లెక్చరు ఇస్తున్నవానిపై కోపంగా చూస్తున్నారు. ఆత్రుతతో ఎదురు చూస్తున్నారు ఎవరి పేరు పిలుస్తారో" అని.

ఆఖరుకి హెడ్‌మాస్టారు మైకు దగ్గరకువచ్చి బహుమతులు పొందినవారి పేర్లు పలికి వారికి అధ్యక్షుల వారిచేత బహుమతులిప్పించేరు. పాటల్లో భావ కవిత్వం కల్పించి చక్కగా పాడిన బుచ్చికి మొదటి ప్రయిజు ఇచ్చారు. వ్యాసరచనల్లో చాలమంది విద్యార్థులు పాల్గొన్నారు. వారందర్లో బాగా వ్రాసిన రాముకి ప్రయిజు ఇచ్చారు. ఇంక వారికి వచ్చిన పరీక్షల్లో మొదటి మార్కులు వచ్చి విజయ్‌కీ, రెండవ మార్కులోవచ్చిన బుచ్చికీ, మూడవ మార్కులో వచ్చిన రాములకూ ప్రయిజులు ఇచ్చారు. ముగ్గురు స్నేహితులూ సభ ప్రారంభమయ్యేదగ్గర్నుంచీ అంతమయ్యేవరకూ కులాసాగా హుషారుగా మొదటి సీట్లపైనే కూర్చొన్నారు. అధ్యక్షులవారు వేదికమీదనుంచి దిగి వెళ్ళిపోతున్నప్పుడు ఈ ముగ్గుర్నీ చూసి నాయనా: మన దేశం కీర్తి నిలబెట్టడం మీ చేతుల్లో వుంది. జాగ్రత్తగా పెద్ద చదువు చదువుకొని విదేశాల్లో మన దేశంగురించి చాటాలి." అంటూ వాళ్ళ ముగ్గురి భుజాలమీద తట్టి వెళ్ళిపోయాడు.

విద్యార్థులంతా ఎవరిళ్లకు వాళ్ళు వెళ్లిపోతున్నారు, విద్యార్థులు హాస్టల్లోనివారు హాస్టల్లోకి వెళ్లుతున్నారు. బహుమతులు పొందిన బుచ్చీ, రామూ, విజయ్ మాట్లాడుకుంటూ విజయుని ఇల్లువైపు బయల్దేరారు.

"రాము! నేను చెప్పలేదూ నీకు కచ్చితంగా వ్యాసరచనలో ప్రయిజు వస్తుందని." అన్నాడు బుచ్చి.

"కష్టపడ్డావులే చెప్పడానికి. నేను మాత్రం అనుకోలేవా? వస్తుందని. కాదుకానీ! వ్యాసాలు వ్రాసి మాష్టారుకి ఇచ్చిన వాళ్ళందరూ—ఏమిటో చెప్పుకో? పూర్తిచేయి దేష్ని" అన్నాడు రాముూ. కొంటెగా బుచ్చినీ, విజయ్‌ని చూసి.

"ఓస్ ఇంకేముంది? దేష్ పూర్తి చేయడానికి. నీకు వచ్చిన వ్యాసరచన బహుమతిని కొట్టేద్దామను కున్నారు. "అంతేనా?" అన్నాడు బుచ్చి.

అది కాదన్నట్టు రాముూ తల వూపాడు.

"ఓస్ నీ ప్రయిజు కొట్టేదామని నీట్‌గా టాయ్ లెట్‌అయి వచ్చారు. అంతేనా? రాముూ!.... అని అన్నాడు విజయ్ నవ్వుతూ.

"రైట్. విజయ్. ఛటుక్కున ఆలోచించకుండా జవాబు చెప్పావు" అని రాముూ బుచ్చివైపు చూశాడు. బుచ్చి మూతి విరుచుకొనేసరికి విజయ్ ఇల్లు చేరు కున్నారు.

విజయ్ ఇంట్లోకి వెళ్లి వాళ్ళమ్మకి ఎవరెవరికి ఏమే ప్రయిజులులొచ్చాయో చూపించారు. ఆమె, ఆ విజయుని తల్లి, వారికిచ్చిన బహుమతుల్నీ కుమారుణ్ణి చూసి సంతోషించింది, మనస్సులో. తరువాత రాముూ

బుచ్చి. "వెళ్లొస్తానమ్మా" అని సెలవు తీసుకుని వాళ్ళు హాస్టలుకి వెళ్ళారు. భోజనాలైన తరువాత బాబూ విరప్ గదిలోకి వచ్చారు. బాబు రావడం చూడగానే బుచ్చి తనకి వచ్చిన ప్రయిజులు చూపించి "ఇవిగో బాబూ! చూడు నాకు వచ్చినవి" అనగానే బాబు "చూశాన్లే! నీకిస్తున్నప్పుడే చూశాను. జాగ్రత్తగా దాచి నాన్నకి చూపించు ఏం...." అన్నాడు.

"అలాగే చూపిస్తా బాబూ!" అని బుచ్చి అమాయకంగా అన్నాడే కాని వాళ్ళ హృదయాన్ని తెలుసుకోలేక పోయాడు. ప్రక్కనున్న రామూ మాత్రం వారి సంగతి అర్థం చేసుకున్నాడు.

మరొక రోజున బుచ్చి రామూ విజయ్ దగ్గర్నుంచి వచ్చేస్తున్నప్పుడు రామూ "బుచ్చి! నే నొకటి అంటాను. కోపం తెచ్చుకోవుకదూ?"

"కోపం దేనికీ?....చెప్పూ"

"ఏమో బాబూ! చెప్పేనంటే చాల కోపం వస్తుందేమో నీకు."

"చెప్పు రామూ! నన్ను వేధించక. కోపము రాదు, గీపమూ రాదు. వచ్చినా అణచుకుంటాను. స్నేహితులంకదా! ఆ మాత్రం దానికేం? చెప్పూ.

"బుచ్చీ! స్నేహితుడవు కాబట్టీ, ప్రాణంతో సమానమైనవాడిని గాబట్టి నిజం చెప్పుతున్నా. మన

ముగ్గురి స్నేహాన్నీ బాబూ, విరప్ చూసి ఓర్వలేకుండా వుండలేకపోవడమే కాకుండా ఆవేళ నన్ను చంపినంత పనీ చేశారు తెలుసా!"

"ఆ....చంపినంత పనేం జేశారూ?" ఆశ్చర్యంగా బుచ్చి అడిగాడు.

"ఔను. బుచ్చీ! వాళ్ళు ఆ రాయిమీదున్నారనే నేనూ దానిమీదకు గెంతబోయి కాలు జారి నీట్లో కొట్టుకు పోయాను. నేను పడుతూ, కొట్టుకుపోవడమూ వాళ్ళు చూసి ఏమీ ఎరగనట్టు మరో ప్రక్కకి దృష్టి మరల్చేరు. ఈ విషయం అప్పుడే చెప్దామనుకున్నాను. సమయం వచ్చినప్పుడు చెప్పుదామని ఊరుకున్నాను. మొన్న ప్రయిజులు మనము పుచ్చుకుంటూన్నప్పుడు వాళ్ళ ముఖాలు ఎలావున్నాయో తెలుసా? బలే కోపాలతో వున్నాయి. రూమ్‌కి బాబు వచ్చిన తరువాత ప్రయిజుల్ని బాబుకి చూపిస్తే సరీగ్గా చూసేదా? ఇదే మంచి సమయమని చెప్తున్నాను బుచ్చీ!ఏమంటావు? 'నువ్వుపడ్డం చూసి కూడ నిన్ను రక్షించలేదా! వెధవలు. అందుకేనా 'ఆ రోజు నాకు వచ్చిన ప్రయిజులు చూడమంటే చూశాన్లే అన్నాడు.' అని బుచ్చి పళ్లు కొరికేడు వాళ్ళమీద.

"బుచ్చీ! వాళ్లు మన స్నేహాల్ని విడగొట్టడానికి ఎప్పుడూ పన్నాగం పన్నుతున్నట్టు తెలుస్తుంది. మనం

ముగ్గురం ఎప్పుడూ స్నేహంగానే వుండిపోదాం. ఎన్ని అవాంతరాలు వచ్చినా మన స్నేహాన్ని మాత్రం పోగొట్టుకోకుండా, కలహాలు పెట్టుకోకుండా వుండాలి. తెలుసా!"

"సరేలే రాముా! ఇలాగే విజయ్‌తో కూడ చెప్పాలి' అనుకుంటూ హస్తలు చేరుకున్నారు.

మన్నాడు స్కూలు విడిచిపెట్టిన తరువాత విజయ్ తన ఇంటికే తిన్నగా వెళ్ళిపోయాడు. బుచ్చీ, రామూ హాస్టలుకి వెళ్ళేరు. ఛటుక్కున క్రిందటి రోజున విజయ్‌కి చెప్పవలసిన విషయం జ్ఞాపకం వచ్చింది. వెంటనే రామూ, ఇప్పుడు విజయ్ ఇంటికి వెళ్దాం.

"దేనికి?"

"అప్పుడే మరచావన్నమాట. నిన్న చెప్పుదామనుకున్నామే, అది చెప్పడానికి. వెళ్దామా?"

"పద ఆలస్యం ఎందుకూ?" అంటూ ఇద్దరూ కలిసి విజయుని ఇంటికి వెళ్ళారు. "విజయ్," అని పిలిచారు ఇద్దరూ. "ఎవరూ బాబూ," అనుకుంటూ తల్లి తలుపు తీసి "మీరేనా నాయనా, రండి.... వెళ్ళి విజయ్‌ని చూడండి. కాళ్ళు ఎలా విరగొట్టుకొని వచ్చాడో" అని విజయ్ దగ్గరకి తీసుకు వెళ్ళింది.

విజయుడు కాళ్ళకి ఆసుపత్రి కట్లు కట్టుకొని మంచంమీద పడుకొని వున్నాడు. అప్పుడప్పుడు బాధకి

"అమ్మా" అంటున్నాడు. రామూ, బుచ్చి దగ్గరగా ఆత్రుత్రగా "విజయ్" అని వెళ్లేసరికి ముఖం గోడ ప్రక్కకి త్రిప్పుకొని "పొండి.... నన్ను చూడ్డానికెందుకు వచ్చారు?" అని విజయ్ అన్నాడు బాధగా. "అదేమిటి విజయ్! కాళ్ళకి ఎలా దెబ్బలు తగిలాయి?" అని ముఖాన్ని చేతులతో వాళ్ల ప్రక్కకి తిప్పి అడిగేరు. అప్పుడే విజయ్ తల్లి అక్కడకు వచ్చి "చెప్పరా, బాబూ, ఎలా తగిలేయో" అని అన్నది.

"మీనుంచే తగిలాయి దెబ్బలు. కోపంగా అన్నాడు.

"మేమేం చేశాం విజయ్? మామీద ఎందుకు కోపగించుతావ్?"

"కోపం కాదూ, ఫుట్ బాల్ మేచ్‌లో ఆడతామని మీరు రాలేదేం? వాళ్ళు పందెం వేసుకొని ఆడుతున్నారు కదా."

"ఫుట్‌బాల్ ఆటా? మేమాడతామని ఎవరు చెప్పారు?"

"ఆ....మీ అన్నా విఠల్ కూడ చెప్పాడు.

"విఠలూ, మా అన్నానా? వాళ్ళకి మాకూ పడనప్పుడు మేమెలా ఆడతామని చెప్పారు?"

"ఏమో నాకదంతా తెలీదు. విఠల్ స్నేహితుడు ఆడబోయే గ్రౌండుకి తీసుకొని వెళ్లాడు. అక్కడ విఠల్

టీములో నువ్వూ, రామూ, తక్కువయ్యారట నన్నూ, విశ్వేశ్వరావునే ఆడమని మీవంతు బతిమాలేరు. సరే, అని ఒప్పుడేను. బాగా ఆడి రెండు మూడు గోల్సు నేనే కొట్టాను నా ఎదురు పార్టీ వాళ్ళెవ్వరో నాకు తెలీదు. నా ఆటనిచూసి ఓర్వలేక పోయేరట. అప్పుడెవరో వచ్చి పడుగెత్తుతున్నప్పుడు గట్టిగా తన్ని నన్ను త్రోశాడు. పడి దెబ్బలు తగిలాయి"

"ఆ....బాబూ, విరస్ కూడ వున్నారన్న మాట?"

"ఇద్దరూ వున్నారు."

"అయితే వాళ్ళిద్దరే తప్పక చేసుంటారు. మన స్నేహాన్ని విడగొట్టడానికి" అని బుచ్చి విజయునితో అంటుంటే కోపం పోయి సందేహంగా విజయ్ బుచ్చి కళ్ళల్లోకి చూశాడు. బుచ్చి ఆ ఫుట్‌బాల్ మేచ్ పట్టి హాంబక్కనీ తనని పడగొట్టి దెబ్బలు తినిపించడానికే ఆ నాటకం ఆడారనీ, ఎక్సర్షన్‌కి వెళ్ళినప్పుడు జరిగిన రామూ దుర్ఘటనకి వాళ్ళే కారకులని ఆ భోగట్టా పూర్తిగా చెప్పాడు. విజయ్ అంతా విన్నాడు. "నిజంగా వాళ్లు అంతపనికి సిద్ధపడ్డారా? సీట్లో పడ్డం చూసే వూర కున్నారా? "అవును విజయ్ మేం చెప్తున్నదంతా నిజం. నీకు ఈ సంగతి అంతా మొన్ననే చెప్దామను కున్నాం. ఇప్పుడు జ్ఞాపకంవచ్చి ఆ సంగతి చెప్పడానికనే ఇక్కడికి వచ్చాం. విజయ్! మన ముగ్గురి స్నేహాన్ని

విడగొట్టడానికి వాళ్ళు ఎంత ప్రయత్నించినా మనం మాత్రం విడిపోకూడదు. మనం ముగ్గురం తప్ప మనం మరెవ్వరి జోలికీ పోవద్దు. ఏమంటావ్ విజయ్? రామూ నువ్వు?"

"అలాగే బుచ్చీ! వాళ్ళ సంగతి ఇప్పుడు తెలిసిందిగా! మన ముగ్గురం దెబ్బలాడకుండా బాగా చదువుకుందామా?" అని విజయ్ లేవబోయేసరికి కాళ్ళకు తగిలిన దెబ్బలు నొప్పిపెట్టి లేవలేకపోయాడు.

రామూ. బుచ్చిలు ఏం విజయ్? ఆత్రుతతో అడిగారు. రాము, కొంచెం నొప్పెట్టింది. అంతే!" విజయ్.

రోజులు గడుస్తున్నాయి. స్నేహితులు ముగ్గురూ కలిసివుంటూ చదువుమీదే ఎక్కువ శ్రద్ధ చూపిస్తూ ఆటలుకూడా మానేసేరు. ఇప్పుడు వాళ్ళు విఠల్‌తోనూ, బాబుతోనూ, మాట్లాడకపోవడం ఇద్దరికీ రోజు రోజుకి కోపం హెచ్చింది. బుచ్చి మాత్రం బాబుతో ఏదైనా అవసరం వస్తేనే మాట్లాడుతుండేవాడు. వీళ్ళూ, వాళ్ళూ మాట్లాడకపోవడంవల్లా మరెవ్వరు ఎక్కడికి పిలిచినా వెళ్ళకపోవడంచేతనూ, వీలుగా వున్నప్పుడు వాళ్ళ నోట్సు పుస్తకాలనీ వాటినీ కాజేసి పారేసేవాళ్ళు.

పెద్ద పరీక్షలు దగ్గరపడుతున్నాయి. రామూ, బుచ్చి, విజయ్‌లు బాగా చదువుతున్నారు. అయి విఠల్

బాబూ ఏవో ముఖ్యమైనవాటినే చదువుతున్నాడు. పరీక్షల్లో పడే ప్రశ్నలన్నింటినీ కష్టపడి తెలుసుకొని, ప్రయిజులు కొట్టేద్దామని పట్టుదలగా చదువుతున్నారు. అప్పుడప్పుడూ బాబు "బుచ్చీ! ఈ సారి ఫస్ట్, సెకెండ్ ప్రయిజులెవరివో తెలుసా?" అడిగేవాడు బుచ్చితో వేళాకోళంగా.

"ఎవరు బాగా చదివి రాస్తే వాళ్ళకి" అని తియ్యగా జవాబిచ్చాడు బుచ్చి.

"ఈ సారి ఆ తియ్యగా చదివేవాళ్ళు ఎవరో తెలుసుకోండి చూద్దాం."

"తప్పకుండా మీ ఇద్దరికే వచ్చేటట్టుంది." అని ప్రక్కనున్న రామూ అన్నాడు.

"భేష్! రామూ ఖచ్చితంగా చెప్పాడు. ఫస్ట్, సెకెండ్ ప్రయిజులు ఈ సారి మావి థర్డ్ ప్రయిజు మాత్రం మీలో.... ' అంటూ మహా బుద్ధిమంతుడులాగా పోజుపెట్టి పుస్తకం పట్టుకొని కూర్చున్నాడు.

ఇది విన్న ఈ ముగ్గురి స్నేహితులకి నవ్వొచ్చింది. వాళ్ళకి ఫస్ట్, సెకెండ్ ప్రయిజు లొస్తాయంటే: కాదూ? మరి—ప్రతి పేపర్లోనూ బాడీగార్డ్సు మార్కులొచ్చే వాళ్ళకి ప్రయిజులంటే మాటలా?

పరీక్ష రోజు దగ్గరికి వచ్చింది. పరీక్ష పేపర్లు ఔటు అయిపోయాయని మాత్రం పుకారొకటి పుట్టింది. అయినా మాష్టర్లు ఏమీ తెలియనట్టు వూరుకున్నారు.

ఆ రోజే పరీక్ష. విద్యార్థులందరూ తెల్లటి బట్టలు కట్టుకొని, తల శుభ్రంగా దువ్వుకొని పరీక్ష అట్టా, దానికి క్లిప్పూ, చేతిలో పెన్నూ, పెన్సిలూ, రబ్బరూ పట్టుకుని వచ్చారు స్కూలుకి. అవి ఆఖరు పరీక్షలవడం వల్ల కొంతమంది విద్యార్థులు దేవుడి గుళ్ళోకి వెళ్ళి కొబ్బరికాయలు కొట్టి మరీ పరీక్షకు కూర్చొన్నారు. బాబూ,విఠల్ బాగా రాయాలని పరీక్షహాల్లో కూర్చొన్నారు. రామూ, బుచ్చీ, విజయ్‌లు కూడ మామూలుగానే వచ్చి పరీక్షహాల్లో కూర్చొన్నారు

బెల్లు కొట్టేసరికి మాష్టారు మొదట తెల్లకాగితాలు తెచ్చి ఇచ్చారు. ఆ ఇచ్చిన కాగితాలమీద అందరి పేర్లూ, వ్రాశారు. బాబూ, విఠల్ నాటిమీద పేర్లు వ్రాసేసి ప్రశ్న పత్రాలు ఇవ్వకుండానే ఏవో ఆన్సర్లు రాసేస్తున్నారు. మరో బెల్లు కొట్టేరు. మాష్టారు, పిల్లలందరికీ పరీక్ష పేపర్లు పంచిపెట్టారు. మాష్టారు పంచిపెట్టిన పేపర్లు అచ్చయినవి కాకుండా చేతితో వ్రాసి స్టెన్సిల్ తీసినవి. ఈ పేపర్లు బాబూ, విఠల్ చూసుకొని చదువుకున్నారు. ఒళ్ళంతా చెమటలు పోసినై. ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. కళ్ళు తేలవేస్తూ. చివరికి బాబు లేచి "మాష్టారూ, ప్రింటుచేసిన పేపర్లీయలేదేమండీ? ఇలాంటివిచ్చేరేం?' అన్నాడు.

"అబ్బాయిలూ ప్రింటెడ్ పేపర్లు చౌటయి పోయాయని రాత్రికి రాత్రి ఇవి తయారు చేసి ఇచ్చారు. ఊఁ....ఇంక రాసుకోండి" అన్నారు మాష్టారు.

ఇంకేం రాస్తారు? వాళ్ళు. వాళ్ళకి తెలిసిన ప్రశ్నలన్నీ మాయమైపోయాయి. అంత కష్టపడి చదివినవీ వృధా అయిపోయాయి. అప్పటికి కాగితంమీద వ్రాసింది కొట్టేసి ఆలోచించుకుంటూ, పై వాసాలు లెక్కపెడుతూ పిచ్చగీతలు గీస్తూ కూర్చొన్నారు.

అటు రామూ, బుచ్చీ, విజయ్‌కి అన్నీ తెలిసిన ప్రశ్నలే అనుకుంటూ చక్కగా వ్రాశారు పేపర్లు. మరి వ్రాయరూ? క్లాసులో మాష్టార్లు చెప్పిన పాఠాలన్నీ కంఠస్థమే కదా? అలాంటప్పుడు ఏ ప్రశ్నలు వేస్తే వారికేం?

అలాగే రాముా, బుచ్చి, విజయ్‌లు పరీక్ష పేపర్లన్నీ చక్కగా వ్రాశారు. బాబూ, వికల్ పేపర్లన్నింటినీ ఒట్టిగా యిచ్చేసి వచ్చారు.

పరీక్షలన్నీ పూర్తిగా ఐపోయాయి. సుమారు రెండు నెలలు సెలవులిచ్చారు. పొరుగూర్లనుంచి చదువు కని వచ్చిన వాళ్లంతా వారి వారి వూళ్ళకి ప్రయాణమై వెళ్తున్నారు. బుచ్చీ రామూలను విజయ్‌ని విడువలేక వెళ్ళారు. విజయ్ తల్లితో సెలవులకు వెళ్తున్నామని చెప్పేసరికి కొంచెం కంట తడిపెట్టింది. "వెళ్ళి వేగం

తిరిగి రండి నాయనా!" అంది "వేగం వచ్చేస్తాం" అని బుచ్చి, రామూ, బయల్దేరుతుండగా విజయ్ కూడ స్టేషనుకి బయలేరాడు దిగబెట్టడానికి. స్టేషనులో జనం కిక్కిరిసి వున్నారు. రామూ టిక్కట్టు తనే కొనుకున్నాడు. బుచ్చికీ బాబుకీ బాబు టిక్కట్లు బాబే కొన్నాడు. బాబూ, విఠల్ ఒక బెంచీ మీదనూ, బుచ్చి, రామూ విజయిలు ఒక బెంచీమీద కూర్చొని మాట్లాడుకొంటున్నారు.

"విజయ్! రిజల్ట్సు రాగానే తప్పకుండా ఉత్తరం వ్రాస్తావుకదూ?" అన్నాడు బుచ్చి "తప్పకుండా వ్రాస్తాను బుచ్చీ. మీరిద్దరూ మాత్రం అప్పుడప్పుడు వ్రాస్తుండండేం! మరచి పోకుండా".

"మరచి పోతామా! విజయ్! మనం ముగ్గురం ఒకటే"అని బుచ్చీ రామూ అంటుండగానే రైలు కిటికీల దగ్గర కూర్చొని విజయ్‌తో మాట్లాడుతున్నారు. వీళ్ళిద్దరూ బండి ఎక్కుతున్నప్పుడు కూడ ఆప్యాయంగా మాట్లాడుకోవడం బాబుకి, విఠల్‌కీ కోపం బాగా వచ్చింది. అయినా ఆ కోపాన్నంతా మింగుకొని ఏమీ అనలేకుండా వూరుకున్నారు. మిత్రులిద్దరూ రైలెక్కి మాట్లాడుతూనే వున్నారు. విజయ్‌తోకాని వారి ముగ్గురి హృదయాలూ, ఆవేశంతోనూ, బాధతోనూ, నిండి వున్నాయి. విజిల్ వూది పచ్చజెండా గార్డు ఊపగానే విజయ్ స్నేహితులిద్దరి చేతుల్ని ఒక్కసారి తన గుండెలమీద

హద్దుకోగా. నీటితో నిండిన కళ్ళతో వాళ్ళని చూస్తూ "రాముా....బుచ్చీ! వెళ్ళిపోతున్నారు. నన్ను మరవ కండేం? ఉత్తరాలు తప్పకుండా వ్రాస్తుండండి. అవైనా చూసుకొని మీరే దగ్గరున్నారనుకొని ఈ రెండు నెలలూ గడుపుతాను." అని అనగానే రెండు వేడి కన్నీటి బిందువులు చెరొకరి చేతిమీద పడ్డాయి. ఇంక బుచ్చి రామూాల మనస్సులు చెప్పనక్కరలేదు. పైకి విజయ్ లాగ కన్నీళ్ళు మాత్రం రాలేదు కాని విజయ్ పడుతున్న బాధే పడ్డారు.

రైలు నడక హెచ్చింది. విజయ్‌కీ స్నేహితులకీ దూరం హెచ్చుతుంది. కనుచూపు మేరవరకూ ఒకరి నొకరు చూసుకుంటూ చేతులూపుకున్నారు.

విజయ్ బండి వెళ్ళిపోయినప్పటికీ ఆ ప్రక్కకే చూస్తూ, చేయి ఊపుతూ కొయ్యలాగ నిలబడిపోయాడు. ఎవరో బరువు మోసుకుంటూ "అడ్డులే" అని విజయ్‌ని పక్కకి నెట్టేవరకూ విజయ్‌కి తెలివి రాలేదు. అప్పుడు విజయ్ ఏదో ఆలోచించుకుంటూ ఇంటికి బయల్దేరాడు.

ఇంక ఇప్పుడు ప్రయాణం చేస్తున్న నలుగురి హృదయాలూ ఏవో ఆందోళన చెందుతున్నాయి. ఇద్దరూ పేపర్లన్నీ తగులబెట్టేమే! ఇంకేం ప్యాసు అవుతామనీ, మరో ఇద్దరూ "అరే" ఎటువంటి స్నేహితుడు విజయ్ మేం వెళ్ళిపోతుంటే ఎంత దుఃఖించాడో? పాపం

విజయ్ తల్లికూడ ఎంతో విచారించిందే! ఎంతటి బీదవాళ్ళైనా ఎంత మంచి హృదయాలు, ఎంత మంచి మనస్సులు కలిగి వున్నవాళ్ళు!" అని అనుకుంటూనే వున్నారు.

రైలు వారి వూరువచ్చి ఆగింది. అరె! ఎంత వేగంగా వచ్చేశాం? మన ఊరికి అని వాచీ పెట్టుకున్న పెద్దమనిషిని టైము అడిగితే ఏదో టైము చెప్పాడు. "అబ్బా మనం బయల్దేరి ఐదు గంటలైందే ఐదు గంటలూ ఐదు నిముషాల్లాగ గడచిపోయాయి.' అనుకుంటూ తెప్పరిల్లి బదకం వదలి గబగబ తమ సామానని ప్లాట్‌ఫారమ్ మీదకు దించుకొని ఇంటిదారి పట్టారు. దార్లో విఠల్ ఇల్లు వచ్చింది. ఇంటిగుమ్మం ఎక్కుతూ విఠల్ "వస్తారా బాబూ ఇంకా విచారించి చేసేదేముంది? రేపు మా ఇంటికొస్తే ఆడుకొనేందుకు పోదాం" అని బాబుతో హెచ్చరించి ఇంట్లోకి దూరేడు.

మరికొంత సేపటికి రామూ ఇల్లు వెళ్లేరోడ్డంట రామూ వెళ్తుంటే బుచ్చి కొంచెం నిలబడి అటుప్రక్క చూస్తూండడం బాబుకి కోపంవచ్చి ఊ....ఇంక నడూ చూద్దూగాని అన్నాడు.

ఆఖరికి బాబూ, బుచ్చీ ఇల్లు చేరుకున్నారు. ఇంట్లో అడుగు పెట్టగానే తల్లి కూరలు తరుగుతున్నది లేచి "వచ్చేర్రా, నాయన్లా ?" అంది.

"వచ్చాం అమ్మా," అన్నాడు బాబు.

"వచ్చేసేమమ్మా" అంటూ బుచ్చి తల్లి దగ్గరకు వెళ్ళాడు. తల్లి బుచ్చిని దగ్గరకు తీసుకొని తలని నిమురుతుండగానే వాళ్ళ నాన్న" 'ఏంరా బుచ్చీ, పరీక్షలు బాగా వ్రాశావ్రా? అన్నాడు.

"వ్రాసేం నాన్నా" అని బుచ్చి లేని చిరునవ్వును పెదాలమీద తెచ్చుకొని అన్నాడు.

బాబూ అలాగే బుర్ర వంచుకొని గదిలోకి వెళ్ళిపోయాడు నోరెత్తి మాట్లాడలేక.

ఇంటికి చేరుకున్నట్లు బుచ్చీ రామూ కలిసి విజయ్‌కి ఉత్తరం వ్రాశారు. విజయ్ కూడ దానికి జవాబిచ్చాడు. కాలం జరిగిపోతున్నది. గ్రీష్మ సెలవులన్నీ అయిపోవస్తున్నాయ్ అప్పుడొకనాడు విజయ్ దగ్గర్నుంచి ఒక ఉత్తరం ఇలా వచ్చింది.

ప్రియమైన స్నేహితులకు బుచ్చికీ రాముకీ వ్రాయునదేమనగా మనం ముగ్గురం ప్యాసు అయినామనీ మీ బాబూ, విఠల్ పరీక్షలు పోయాయనీ చిన్న భోగట్టా మాత్రం తెలిసింది. రిజల్ట్సు ఇంకా పెట్టలేదు ప్రస్తుతం నా ఒంట్లో ఏమీ బాగులేదు. వారం రోజుల్నుంచీ ఒకటే జ్వరం కనుక మిమ్మల్ని ఒకసారి.... ఇట్లు

మీ ప్రాణమిత్రుడు
విజయ్.

ఈ ఉత్తరం బుచ్చి ఇంట్లో లేనప్పుడు బాబు అందుకొని చదివి "చూశారా? నాన్నా! ఈ విజయ్! గాడికి ఒంట్లో బాగులేదట. బుచ్చిని రమ్మని వ్రాస్తు న్నాడు. వెధవ అంతా గమ్మత్తు త్తరాలు. బుచ్చిని పంప కండి నాన్నా" అన్నాడు కోపంగా.

"బుచ్చిని పంపకండి ' అన్న మాటని అప్పుడే గుమ్మం ఎక్కుతున్న బుచ్చి విని "దేనికి పంపరు నాన్నా?" అంటూ వెళ్లాడు నాన్న దగ్గరకు.

అప్పుడే ఆ ఉత్తరాన్ని బాబు నాన్నకి ఇచ్చేయ డంవల్ల దాన్ని బుచ్చికి చూపించాడు. బుచ్చి ఉత్తరం చదువుతూ విచారించేడు. "విజయ్ పరిస్థితి చాలా ఆప దలోనే వుందనుకున్నాడు. లేకపోతే విజయ్ వ్రాయడానికి బదులు వాళ్ళమ్మెందుకు వ్రాస్తుంది. ఆ ఉత్తరం? ' అని అనుకొని...

ఇప్పుడే వస్తాను నాన్నా "అని అంటూ బుచ్చి పరుగెత్తుకొని రామూ ఇంటికి వెళ్ళాడు వాళ్ళ నాన్న వెళ్ళొద్దన్నా".

రామూతో విజయ్ పరిస్థితి అంతా చెప్పి "విజయ్ దగ్గరకు వెళ్దాం వస్తావా?" అని అడిగాడు బుచ్చి. "వస్తావా? అని అడుగుతావా? పద" అని రామూ వాళ్ళ నాన్నగారి కోటు జేబులోనుంచి పది రూపాయలుంటే తీసుకొని వెంటనే స్టేషనుకి బయ

ల్దేరారు ఆత్రుతగా. ఎంత ఆత్రుతగా బయల్దేరితే మాత్రం రైలు వేగం వచ్చేస్తుంది గనుకనా? దాని వేళకు అది వస్తుంది. స్నేహితులిద్దరూ వెళ్ళిన గంటకిగాని రైలు రాలేదు. ఆ గంటసేపూ వాళ్ళు ఒక యుగంలాగా గడిపారు. ఆఖరుకి "ఛీ! వెధవ రైలు. దాని టైముకి అదే వస్తుందట. ఇవ్వేళ మనకోసం ఒక గంటముందు రాకూడదా?' అని అనుకొంటుండగనే రైలు జుఫ్ జుఫ్ మని శబ్దం చేసుకుంటూ వచ్చింది. రామూ రెండు టిక్కట్లునికొన్నాడు. బండి ఆగగానే తుర్రున ఎగిరి కూర్చున్నారు. రైలు ఆ స్టేషనును వదిలింది. ఎంత జోరుగా రైలు నడుస్తున్నా ఈ సారి బండి బహు కష్టంగా నడుస్తున్నట్లు. నెమ్మదిగా వెళ్లి చేరుకుంది వాళ్ళు దిగవలసిన ప్రదేశానికి.

ఆగడమే తరువాయి వేగంగా దిగి విజయ్ ఇంటికి పరుగెత్తారు. అలసి అలసి విజయ్ ఇంటికి చేరుకున్నారు. విజయ్ మంచంమీద పడుకొని ఉన్నాడు. తల్లి విజయ్ దగ్గర కూర్చుని వున్నది. స్నేహితులిద్దరూ విజయ్ మంచానికి ఇరుప్రక్కలా వెళ్లి, ఇరువురూ కూర్చొని విజయుని చేతులు చెరొకటి పట్టుకొని దీనంగా "విజయ్!..!.." అని పిల్చారు, ఎంత సేపటినుంచో మైకం కమ్మి పడుకున్న విజయ్ స్నేహితులగొంతు కలను విని ఒక్కసారి కళ్ళు తెరచి చిన్న నవ్వు నవ్వేడు

వచ్చేరా? అన్నట్లు. అంతకంటే మరేం మాట్లాడ లేక పోయాడు. విజయ్ మాట్లాడకపోవడం స్నేహితుల మనస్సుల్ని కలవరపెట్టాయి. విజయుని తల్లిని లేపి "అమ్మా? డాక్టరేమన్నాడు? విజయ్ గురించి! అన్నాడు బుచ్చి.

"ఏమంటారు నాయనా? ఈ రోజుల్లో డాక్టర్లకి కావలసింది డబ్బు. ఆ డబ్బు లేకపోతే ఎలా వస్తారు నాయనా? వరుసగా నాలుగు రోజుల్నుంచి తిరుగు తున్నాను. ఒక్కడికీ దయ పుట్టలేదు. విజయ్ మీరెళ్ళిన దగ్గర్నుంచి ఎప్పుడూ మిమ్మల్నే కలవరిస్తున్నాడు." అని చెప్పింది.

రామూకి బుచ్చికి మరింత కంగారు పుట్టింది. ఏం చెయ్యాలో తోచింది కాదు నువ్విక్కడే చూస్తూండు! అంటూనే బయల్దేరాడు డాక్టరు దగ్గరకు బుచ్చి.

బీదల ఇళ్ళకి ఏ డాక్టరు వస్తాడు? పాపం! బుచ్చి కాళ్ళు అరిగిపోయేట్టు అందరి దగ్గరకూ వెళ్ళి రమ్మని మని ప్రాధేయపడ్డాడు. హూ...హూ..వాళ్ళ రాతి గుండెలు ఎవరిదీ కరుగలేదు. ముందు విజిటింగ్ ఫీజూ, తరువాత మందుకి డబ్బూ ఇస్తేనే వస్తామని నిక్కచ్చిగా చెప్పేరు, చివరికి బుచ్చికి డాక్టర్లమీద కోపం వచ్చి ఉగ్రమూర్తియై "డాక్టరు! డబ్బున్న వాళ్ళ దగ్గరికే వెళ్తారు. ఫీజు ఇచ్చుకోవాలట! ఎంతమంది బీదలు

మందులులేక చచ్చిపోతున్నారో? అలా చచ్చిపోనివ్వను. నేనే పెద్దవాడ్నయి, డాక్టరు చదువుకొని వీళ్ళందరికి సహాయం చేయకపోతే నా పేరు బుచ్చేకాదు. అని అను కుంటూ నడిరోడ్డంట నడుస్తుండగా చటుక్కున కారు క్రింద పడ్డాడు. అదృష్టవశాత్తూ ఆ కారు డాక్టరుదై వుండడంవల్లా, బుచ్చి కాలుకి చిన్న దెబ్బే తగులుటవల్లా, ఆ డాక్టరే ఆ చిన్న గాయాలకి కట్టు కట్టాడు. అప్పుడు బుచ్చి అదే మంచి అదను అనుకొని "డాక్టరుగారు! ఒక సారి మా యింటికి వస్తారా? మా విజయ్‌కీ, చాల జబ్బు చేసింది. అని మృదువుగా నమ్రత భావంతో అన్నాడు. ప్రక్కనే నిల్చొనివున్న డాక్టరుగారి భార్య సునీత బుచ్చి వినయత, మాట్లాడ్డమూ, బుచ్చి వాడి యున్న ముఖాన్ని చూస్తూ నిల్చొని.

బుచ్చి చెప్పిన మాటల్ని ప్రకాశరావు డాక్టరు గారు శ్రద్ధగా విని సునీతవైపు చూశారు. వెళ్లేదా? అన్నట్టు—

"పదండి వెళ్దాం." అంది

ఇద్దరూ బుచ్చిని తమ కార్లో ఎక్కించుకున్నారు. అప్పుడు బుచ్చి హృదయం ఎంత సంతోషించిందో! దారి ఫలానా అని చెప్పాడు బుచ్చి డాక్టరుగారు ఆ దారి వెంటే కారు పోనిస్తున్నారు. కారు వెనుక సీట్లో బుచ్చి,

సునీతా కూర్చొన్నారు. సునీత బుచ్చి సంగతున్నీ అన్నింటినీ అడిగింది. బుచ్చి అప్పటికి జరిగిన సంగతంతా చెప్పి తన స్నేహితుడ్ని, తప్పకుండా ఎంత కష్టపడైనా నయం చేయించమన్నాడు.

సునీతకు పిల్లల్లేకపోవడంవలనో ఏమో చాల బాధపడినట్టు నొచ్చుకుంది. బుచ్చి చెప్పింది విని "సరేన్లే బుచ్చీ! అంతా నేను చూసుకుంటానులే" అని విచారిస్తున్న బుచ్చి తల నిమిరింది కన్న తల్లిలా! అలా నిమిరినంతసేపూ ఆమె హృదయం ఎంత సంతోషించిందో తెలీదు. అంతట్లోకి విజయుని ఇల్లు చేరుకున్నారు. డాక్టరూ, భార్యా, బుచ్చీ, కారు దిగి ఇంట్లోకి వెళ్ళారు ఏమీ తోచక అటూ ఇటూ భయంతో రాముా పచార్లు చేస్తున్నాడు. డాక్టర్నీ బుచ్చినీ చూడగానే ముఖం పెద్దదిగా చేసుకున్నాడు.

డాక్టరుగారు విజయ్‌నీ పరీక్షించారు. చాల ప్రమాద పరిస్థితి అని ఏవో ఇంజెక్షన్‌లు ఇచ్చారు. ఇంజక్షన్‌లు ఇస్తున్నంతసేపూ సునీత ముగ్గురి స్నేహితుల వంకా చూస్తూ నిలబడిపోయింది. అతనిని జాగ్రత్తగా చూడమన్నారు డాక్టరుగారు. మళ్ళీ వస్తామని డాక్టరుగారూ, భార్యా, వెళ్ళిపోయారు.

మర్నాడు పొద్దున్నే కారుమీద డాక్టరూ, భార్యా, పనిమనిషితో విజయుని ఇల్లు చేరేరు. డాక్టరు అతని

చేతులు చూసి ఏదో మందులు కలిపి ఇచ్చారు. రాత్రల్లా నిద్రలేని బుచ్చీనీ, రామూనీ చూసి జాలిపడింది డాక్టరు గారి భార్య సునీత.

"బుచ్చీ! మా ఇంటికి వెళ్దాం రా....ఒకసారి రామూ నీవు కూడ రా...." అన్నాది సునీత.

"ఇప్పుడు వీళ్ళనీ వదిలి రాలేమండీ"

"మీరిద్దరూ వీళ్ళకేం చేయగలరని? చదువుకునే పిల్లలు, మా దాసీని ఇక్కడ పెడతాను. మీరిద్దరూ మాత్రం రండి"

"మా స్నేహితున్ని విడిచి ఎక్కడికి వెళ్ళమండి...."విచారంగా ముఖాలు పెట్టారు.

"మీ స్నేహితుడుకీ, వచ్చిన భయం ఏమీ లేదు. అతనిని హాస్పిటల్‌లో చేర్పించాలట"

"ఆసుపత్రిలోనా? వాళ్ళని చేర్పుకుంటారా?" అన్నాడు బుచ్చి.

"డాక్టరుగారే అన్నీ చూసుకుంటారు. మీరు మాత్రం నాతోరండి" అంది.

తప్పదని బుచ్చీ, రామూ ఆమెతో డాక్టరుగారి ఇంటికి వెళ్లేరు. స్నేహితుడ్ని జాగ్రత్త! అని హెచ్చరిస్తూ డాక్టరుగారు వాళ్ళని పెద్ద బిల్డింగులో వదిలి కారు మీదే స్పీడుగా వెళ్ళారు. సునీత వాళ్ళని ఇంట్లోకి తీసుకొని వెళ్ళింది. అంత పెద్ద యింటోకెళ్ళడం వాళ్లిద్దరికీ

అదే మొదటిసారి, పెద్దగదులు! నిలువు టద్దాలు, ఇంకా ఎంతో ముచ్చటగా వుంది.

రామూ ఆశ్చర్యంగా డాక్టరుగారి భార్య వైపూ బుచ్చి పక్కా చూస్తున్నాడు. బుచ్చికి ఏమీ అర్థం కాలేదు. వాళ్ళు చూస్తే ఎంతో ధనవంతులు. ధనవంతులు ఆ బీదలమీద అలా ప్రవర్తించడంలో బుచ్చికి ఆశ్చర్యం వేసింది.పనిమనిషిచేత నీళ్ళు పెటించి పోసుకోమన్నది.

"వద్దండి! అవన్నీ మాకెం..కండి? వెళ్ళిపోవాలి మేము" అన్నాడు బుచ్చి.

"అదేం బుచ్చీ! ఎక్కడికి వెళ్ళాలి? మీరు పోసుకో పోతే నేను పోస్తాను" అని డాక్టరు భార్య సునీత వాళ్ళిద్దరికీ బలవంతంగా స్వయంగా నీళ్ళు పోసింది.

తరువాత వంటింట్లోకి తీసుకు వెళ్ళి చక్కని భోజనాన్ని వాళ్ళ ముందుంచి "తినండి బుచ్చీ రాత్రల్లా నిద్రాహారాలు లేవు" అంది.

ఒక పెద్దమనిషి చెప్పే పనులు ఏ బుద్ధిమంతులు చేయరు? బుచ్చీ, రామూ ఏదో కొంచెం మోహమాటంగా తిని లేచి పోయారు. అప్పుడే డాక్టరుగారు వచ్చి "బుచ్చీ విజయ్‌ని ఇక్కడికి తీసుకొని వచ్చేద్దాం. అక్కడే సదుపాయాలూ జరుగవు. వాళ్ళ అమ్మకు జ్వరం వచ్చింది. ఆమె జ్వరం చాల పెద్దదపడంవల్ల కె. జీ. హాస్పిటల్‌కి పంపవలసి వుంటుంది. నేను ఆ జబ్బుని

కుదర్చలేను. ఆమెను ఇప్పుడే అక్కడికి పంపించేను కూడా. విజయ్‌ని ఇక్కడికి తీసుకొని వచ్చేస్తున్నాం." అనీ అనడంతోటి ఇద్దరు నౌకర్లు విజయ్‌ని తీసుకొని వచ్చి మంచంమీద వేశారు.

పాపం. ఆ పిల్లలకి ఏం తెలుసు? విజయ్ తల్లికి పెద్ద జ్వరము అనుకున్నారే? కాని ఆమె స్వర్గానికి వెళ్లిందని ఆ సమయంలో తెలుస్తే ఆ పసిపిల్లల హృదయాలెంత బాధపడతాయో అని డాక్టరుగారు ఆ విషయమై ఎక్కువ చెప్పకుండా బొంకారు.

రోజులు గడుస్తున్నకొలదీ విజయుని వ్యాధి తగ్గుముఖం పడుతోంది. బుచ్చికీ, రామూకీ డాక్టరుగారి భార్య అంటె చనువుకూడా ఏర్పడుతుండేది విజయ్‌కి డాక్టరుభార్యే స్వయంగా ఏ లోటుపాటూ లేకుండా కన్నతల్లి లాగే చేస్తుండేది. విజయ్‌కి ఒకనాడు బాగా తెలివి వచ్చిన నాడు రామునీ, బుచ్చినీ, తనివితీర కౌగలించుకొని తానున్న అంత పెద్ద ఇల్లు ఎవరిదని అడిగాడు.

"ఈ ఇల్లు డాక్టరుగారిది. ఎంతో మంచివారు. నీవు వ్రాయించిన ఉత్తరం చూసిన వెంటనే నీ దగ్గరికి వచ్చాం. అప్పుడు నీవూ, మీ అమ్మా చాల ప్రమాద స్థితిలో వున్నారు. ఎందరు డాక్టర్ల దగ్గరికి వెళ్ళి ప్రార్థించినా ఒకరూ రాలేదు. వాళ్ళదరికీ ఫీజు కావాలట ఆఖరుకి నిరాశతో వస్తూంటే ఈ డాక్టరుగారే నిన్నూ మీ

అమ్మనీరక్షించారు.మీ అమ్మని హాస్పిటల్‌లో చేర్పించారు. నిన్ను ఇక్కడికి తీసుకొచ్చారు అని బుచ్చి చెప్పుతుంటే దూరంనుంచి వింటున్న డాక్టరుగారి భార్య వచ్చి "బుచ్చీ! తప్పుకాదూ? రోగిని అట్టే మాట్లాడించ వచ్చునా?" అని పళ్ళరసం విజయ్ మంచం దగ్గరున్న టేబుల్ మీదనుంచి తీసి పడుకొన్న విజయ్‌ని కూర్చో బెట్టి "ఈ రసం తాగు విజయ్" అన్నది.

విజయ్ పళ్ళరసం తాగకుండా ఆమె కళ్ళల్లోకి చూస్తూ "నా కోసం మీరెంత కష్టపడుతున్నారో? ఎందు కంత కష్టపడాలమ్మా? బీదవాళ్ళు ఎలాపోతేనేం?" అన్నాడు.

"తప్పు విజయ్! మీ అమ్మ ఇస్తే తాగవా? అలాగే తాగేయ్ నాయనా" అంది.

"తాగుతానమ్మా! అచ్చంగా మాఅమ్మ మాట్లాడు తున్నట్టే మాట్లాడుతున్నారమ్మా. అమ్మకి ఏలా ఉంది న్నారు? డాక్టరుగారు?' అని అడిగాడు విజయ్.

ఆ మాట వినేసరికి సునీత ముఖంలోని సంతోష చ్ఛాయలు క్షీణించి కన్నీరు కార్చింది. ఆ కన్నీటిని స్నేహితులు ముగ్గురూ చూసి "ఇదేమిటి అమ్మగారూ?" అనడిగారు ఒక్కసారి.

"ఏం లేదు నాయనా" అంటూ కన్నీటిని తుడుచు కొని పళ్ళరసాన్ని త్రాగించి వెళ్ళిపోయింది అక్కణ్ణుంచి.

మరో వారం గడచింది. విజయ్‌కి పత్యం పెట్టారు. రాముా బుచ్చీ చాల సంతోషించారు. ఒకనాడు అందరూ భోజనానికి కూర్చొన్నప్పుడు విజయుడు డాక్టరుగారితో "మా అమ్మని చూడ్డానికెప్పుడు వెళ్ళమంటారు? అని అడిగాడు.

అది విన్న డాక్టరు గతుక్కుమన్నాడు. ప్రకాశరావు భోజనం తొందరగా ముగించి వెళ్ళిపోయాడు. అప్పుడు "అమ్మని ఎప్పుడు చూడ్డానికి వెళ్ళేది?" అని అడిగాడు సునీతని.

అమ్మ మాట వినగానే సునీత రెండు కన్నీటి బిందువులు రాలేయి. అన్నంమీద. "బాబూ విజయ్ మీ అమ్మని నీవు కలుసుకోలేవు. ఇంక ఆమెను తలచుకోకు."

"ఏవమ్మా? మా అమ్మని ఎందుకు తలంచుకోనూ?" అని తడబడుతూ ప్రశ్నించాడు.

"విజయ్! నిన్ను ఇక్కడికి ఎప్పుడు తీసుకొచ్చామో ఆ రోజే మీ అమ్మ హటాత్తుగా చనిపోయింది. ఇన్నాళ్ళూ నీ ఒంట్లో బాగాలేదని చెప్పలేదు. "అని అనేసరికి విజయ్ "చచ్చిపోయిందా? మా అమ్మ?" అని ఏడుస్తూన్నప్పుడు రామూ, బుచ్చీలు కూడా కళ్లంట నీరు పెట్టకపోలేదు.

అప్పుడు ప్రకాశరావు వాళ్ళ ముగ్గురున్నీ తన గది లోకి తీసుకెళ్ళారు. భార్య కూడా వారిని అనుసరించింది.

"అబ్బాయిలూ! నేనొక్కమాట అంటాను! అలా మీరు చేస్తారా? చేయరా?" అన్నారు.

మిత్రులు ముగ్గురూ "సరే" అన్నట్లు తల లూపారు.

"ఇకమీదట విజయ్ ఇక్కడే వుండిపోతాడు. విజయ్‌తోపాటు మీరిద్దరూ వుంటారా? చక్కగా చదువు కొందురుగాని—నీకే లోటు లేకుండా వుండనిస్తా" అన్నారు డాక్టరు.

విజయ్ మౌనంగా తలవంచుకున్నాడు.

"శెలవుల్లో మాత్రం మా ఊరుకి వెళ్తాం. మిగతా రోజుల్లో ఇక్కడే ఉంటాం. మేము విజయ్‌తోనే ఎప్పుడూ స్నేహంగా మీ దగ్గరే ఉంటాం." అని రామూ, బుచ్చీ పలికారు.

అప్పుడు మంచం వెనుక నిల్చొన్న ప్రకాశరావు భార్య సునీత పెదాలమీద చిన్న నవ్వొచ్చింది.

ఆ తరువాత రెండు రోజులకి స్కూలు తెరి చారు. డాక్టరుగారు వాళ్ళ పూర్తి పేర్లూ, క్లాసూ, డివిజన్, నెంబర్లూ నోట్ చేసుకొని హెడ్ మాస్టార్ని అడిగారు ప్యాసయ్యారా? అని. హెడ్ మాస్టారు మార్కుల లిస్టూ అదీ చూసి "వీళ్ళు ముగ్గురూ ఫస్ట్‌గా ప్యాసు అయ్యా

రండీ! ఫస్ట్, సెకెండ్, థర్డ్ మార్కులన్నీ మొదటి ముగ్గురిదే విశల్ బాబుదీ పరీక్ష పోయిందండీ" అని చెప్పారు.

వాళ్ళ ముగ్గురికీ ఫస్ట్ మార్కులు రావడం డాక్టరుగారి హృదయానికి మరింత ఆనందం కలుగ చేసింది. ఒక మొక్కకి నీళ్ళు ఎవరూ పోయకుండావుంటే ఏదో కొంచెం కొంచెం పెరుగుతుంది. అదే మొక్కకు మానవుడు నీళ్ళు, అవీ పోస్తే ఎంత బాగా పుష్టిగా పెరుగుతుందో అలాగే వీళ్ళ ముగ్గుర్నీ పెద్ద చదువులు చదివించుదామన్న ఆశ హెచ్చింది డాక్టరు ప్రకాశరావు గారికి.

అక్కడ వాళ్ళకి ఉత్తరం వ్రాశాడు బుచ్చి జరిగినదంతా. బాబుది, విశల్‌ది పరీక్ష పోయిందని వ్రాశాడు. డాక్టరుగారు కూడ స్వయంగా ఇలా ఉత్తరం వ్రాశారు "స్నేహితుల ముగ్గురిని చూస్తుంటే మాకెంతో పరమానందంగా వుంది. వాళ్ళ ముగ్గుర్నీ మా ఇంట్లోనే ఉంచి వాళ్ళ కిష్టం వచ్చిన పెద్ద చదువుల్ని చదివిస్తా" అని వ్రాశారు.

ఆ ఉత్తరం చూసుకున్న బుచ్చి తండ్రి ఎప్పుడూ పొందని సంతోషాన్ని పొందేడు. బాబుకి నాగలిచ్చి "దున్నుకోరా! భూమి" అన్నారు. విశల్‌కి కూడ అదేగతి పట్టింది.

అక్కడ బుచ్చీ, రామూ, విజయ్‌లు
ఫారంలో చేరేరు. వాళ్ళ ముగ్గురి స్నేహితుల
చూస్తున్న డాక్టరుగారికీ, ఆయన భార్యకీ పుత్రులు
లోటు తీరిపోయింది.

బుచ్చీ, రామూ, విజయ్‌లు ముగ్గురూ
భవిష్యత్తులోని వెలుగు మార్గాన్ని వెతుక్కు
ముందుకు సాగిపోతున్నారు.







**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B152 |
| పుస్తకం పేరు | మంచి స్నేహం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 93. |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Hhasin |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |